# ఆంధ్ర ప్రదేశ్



సమాచార, పౌరసంబంధముల శాఖ ; ఆంధ్ర ప్రదేశ్.

Registered No. H-373

సంపుటి 3 జనవరి 1959—మాఘము, శాలివాహనశకము-1౦80 సంచిక 3

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడినది.



శ్రీ అఫ్‌సర్ ఖాన్ హైద్రాబాదు విక్టరీ ఆటస్థలంలో 176 గంటలు సైకిలుతొక్కి, 13.12.58న ప్రపంచంలో కొత్తరికార్డును (తామిదివరకు నెలకొల్పిన 175 గంటల రికార్డును అధిగమించి) స్థాపించారు. ఆ సందర్భంలో ముఖ్యమంత్రి, నీటిపారుదల, విద్యుచ్ఛక్తిశాఖామంత్రి ఆయనను అభినందించారు.



వైమానిక సిబ్బంది అధిపతి ఎయిర్‌మార్షల్ ముఖర్జీ 19-12-58న హైదరాబాదు వైమానికదళం కేంద్రంలో నెం. 73 పైలట్లకోర్సు, నెం. 14 నావిగేటర్ల కోర్సుల గ్రాడ్యుయేషన్ వుత్సవంలో ఎయిర్ వర్క్ నావిగేటర్లలో వుత్తమోత్తమునికి నావిగేషన్ ట్రోఫీని బహూకరిస్తున్న దృశ్యం.



# ఆంధ్రప్రదేశ్

జనవరి, 1959

సంపుటి 3 సంచిక 3

మాఘము, శాలివాహనశకము-1880

## విషయసూచిక

| | | |
|---|---|---|
| పారిశ్రామిక పథకాల ప్రగతి | ... | 1 |
| తాళవృక్షం | ... | 15 |
| కడప | ... | 18 |
| గోమయంతో వాయువు తయారీ | ... | 22 |
| వ్యవసాయ పరిశోధన | ... | 27 |
| దంపుడుబియ్యం విశిష్టత | ... | 33 |
| కాకినాడ వైద్య కళాశాల | ... | 36 |
| ప్రశ్నోత్తరావళి | ... | 41 |
| జిల్లా వార్తలు | ... | 43 |
| చిన్న మొత్తాల పొదుపుకి కొత్త సౌకర్యం | ... | 56 |

## ముఖచిత్రం

2-12-58 న రుద్రూరు వ్యవసాయ పరిశోధనా కేంద్రం రజతోత్సవాల సందర్భంలో జరిగిన ప్రదర్శనలో చెఱకును తనిఖీచేస్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రి.

— చందా వివరాలు —

సంవత్సరానికి 2 రూపాయల 16 నయాపైసలు

విడిప్రతి వెల 18 నయాపైసలు

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి

సిటిజన్ ప్రెస్‌లో ముద్రింపబడినది.



రాష్ట్రంలో :

# పారిశ్రామిక పథకాల ప్రగతి

ఖాదీ, చిన్నతరహా, కుటీర పరిశ్రమలను ఒక పద్ధతిప్రకారం సమన్వయ పూర్వకంగా అభివృద్ధి పరచుట ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రధానాశయాలలో ఒకటి.

ఆంధ్రప్రదేశ్ ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయం కాబట్ట వ్యవసాయంపనులు లేని కాలంలో రైతులకు వుపవృత్తులను చూపుటకు కృషి చేయవలసివుంది. ఆపైన కుటీర పరిశ్రమల అభివృద్ధికి విస్తారమయిన వస్తుసంపద అందుబాటులో నున్నందున యెక్కువ మందిని పరిశ్రమలవైపుకి మళ్ళించాలి.

ఆంధ్రప్రదేశ్ యేర్పడిన రెండవసంవత్సరంలో ఖాదీ, చిన్నతరహా పరిశ్రమలు, గ్రామ, కుటీర పరిశ్రమలకి సంబంధించిన వివిధ పథకాల అములులో సాధించిన అభివృద్ధి వివరాలు సంగ్రహంగా దిగువ యివ్వబడినవి.

రాజమండ్రీలోని ఆంధ్ర కాగితంమిల్లులో కాగితం ప్రస్తుతపు వుత్పత్తిని రోజుకి 50-60 టన్నులకు హెచ్చించుటకై రూ. 242 లక్షల అంచనాఖర్చుపై ఆ మిల్లుల విస్తరణ చేపట్టబడింది. రూ. 190 లక్షలు ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలోను, మిగిలిన రూ. 52 లక్షలు తృతీయ పంచవర్ష ప్రణాళిక తొలి సంవత్సరంలోను ఖర్చు పెట్టబడతాయి.

ప్లాంటు, యంత్రాలకు సంబంధించిన పూర్తి వివరాలను తేల్చి, వాటి కొనుగోలు కవసరమయిన యేర్పాట్లు చేయబడినవి. వచ్చిన టెండర్లు ప్రోసెస్ చేయబడినవి. విదేశ మారకం చిక్కును తొలగించుటకై యంత్రాల కొనుగోలు విషయంలో క్రొత్త ఢిల్లీలోని ప్రభుత్వ వ్యాపార సంస్థతో సంప్రదించి, రూపాయ చెల్లింపు ప్రాతిపదికపై యంత్రాల కొనుగోలుకి యేర్పాటు చేయమని కోరడం జరిగింది. సరుకు విడుదలకాలం, విదేశమారకం అందుబాటులో వుండే విషయం నిశ్చితంగా తెలియవు కాబట్టి 1958-59 లో ప్రణాళికా పథకానికి రూ. 20 లక్షలు మాత్రమే కేటాయించబడినవి.

గూడూరు ప్రభుత్వ పింగాణీ ఫ్యాక్టరీ విస్తరణ కార్యక్రమం దాని వుత్పత్తి శక్తిని పెంపొందించుటకు సంబంధించినది. అదనపు భవనాల నిర్మాణం పూర్తిఅయింది. మిక్కిలి ముఖ్యాంశమయిన టన్నల్ కిలన్ ఇంగ్లండునుంచి తెప్పించబడి, స్థాపించబడుతున్నది.

తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర కాగితం, అట్టల మిల్లు వెనుక ప్రభుత్వ సహాయంతో నడిచేదల్లా ప్రభుత్వంచే రూ. 2.72 లక్షలకి కొనబడింది. ప్రణాళికా కాలంలో రూ. 10.35 లక్షల వ్యయంపై దానిని ప్రభుత్వ వాణిజ్య సంస్థగా నడుపుతూ రోజుకి 8-10 టన్నుల అట్టను తయారు చేయాలనే ప్రతిపాదనలు రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పింపబడినవి.

ప్రస్తుత భవనం మరమ్మతుకి రూ. 16,000/-, కొత్తభవనాలకి రూ. 96,000/- ప్రభుత్వం మంజూరు చేసింది. కొన్ని పరికరాల కొనుగోలుకై కూడా ప్రభుత్వం రూ. 1,23,000/- మంజూరు చేసింది.



1-1-59 న హైదరాబాదులో రాష్ట్ర ముఖ్యమంత్రి 19వ అఖిలభారత పారిశ్రామిక వస్తు ప్రదర్శనను ప్రారంభిస్తున్న దృశ్యం.

## చిన్నతరహా పరిశ్రమలు

రాష్ట్రంలో చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధికై ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో రూ. 313.44 లక్షలు కేటాయించబడినవి. ఇదికాక, పారిశ్రామిక కేంద్రాల స్థాపనకై మరి రూ. 97.38 లక్షలను ఖర్చు చేయాలని సంకల్పించబడింది.

చిన్నతరహా పరిశ్రమల సత్వరాభివృద్ధికి దోహద మిచ్చుటకై కేంద్రప్రభుత్వ ఆర్థిక సహాయంతో రాష్ట్ర ప్రభుత్వం దిగువ చర్యలను గైకొంటున్నది: పారిశ్రామిక కేంద్రాల స్థాపన; డిపార్టుమెంటల్ ట్రైనింగు; ఉత్పత్తి యూనిట్లు; చిన్నతరహా ప్రైవేటు పరిశ్రమలకు అప్పుల మంజూరు.

## పారిశ్రామిక కేంద్రాలు

పారిశ్రామికులకు అద్దెకు కాని, అద్దె కొనుగోలు పద్ధతిపై కాని, సరాసరి కొనుగోలు పద్ధతిపై కాని ఒక పద్ధతిప్రకారం చక్కగా నిర్మించబడిన ఫ్యాక్టరీ భవనాలను సమకూర్చుటకై పారిశ్రామిక కేంద్రాలు నెలకొల్పబడుతున్నాయి. ఈ ఫ్యాక్టరీ భవనాలకి నీరు, విద్యుచ్ఛక్తి, మురుగు పారుదల, రవాణా మున్నగు మామూలు సౌకర్యాలు కల్పించబడతాయి. ఇవికాక, తపాల కార్యాలయం, బ్యాంకి, కాంటీను, ప్రథమ చికిత్సా కేంద్రం, సామాన్య పని కేంద్రాలు మున్నగునవికూడా సమకూర్చబడతాయి. ప్రభుత్వం యింతవరకూ మొత్తం రూ. 87 లక్షలపై హైదరాబాదు (సనత్‌నగరం), విశాఖపట్నం, విజయవాడ, సామర్లకోటలలో 4 కేంద్రాల స్థాపనను మంజూరు చేసింది. ఈ కేంద్రాలపై 1957-58 లో రూ. 19.38 లక్షలు ఖర్చు చేయబడినవి. జరిగే సంవత్సరంలో వరంగల్లు, నంద్యాలలో పారిశ్రామిక కేంద్రాల స్థాపనకు కేటాయించబడిన రూ. 3.5 లక్షలతో సహా రూ. 36.62 లక్షలు ఖర్చు కాగలదని భావించబడుతున్నది. ప్రణాళికాకాలంలో ఆంధ్ర ప్రదేశ్‌లో పారిశ్రామిక కేంద్రాలకు మొత్తం రూ. 70 లక్షలు మాత్రమే కేటాయించబడిందని కేంద్రప్రభుత్వం తెలియచేసింది. ఇది చాలదుకనుక గరిష్ఠ పరిమితిని అధమం రూ. 125 లక్షలకి పెంచమని వారిని కోరడం జరిగింది.

## శిక్షణ, ఉత్పత్తి యూనిట్లు

చిన్నతరహా యూనిట్ల స్థాపనలో రాష్ట్రప్రభుత్వం ఆశయాలు యివి:

1 ప్రస్తుతపు చేతిపనులవారికి ఆధునిక పద్ధతులలోను, ఆధునిక పనిముట్లు, పరికరాల వాడకంలోను శిక్షణనిచ్చుట.

2 వస్తునాణ్యాన్ని పెంపొందించుకొనుటకు వీలుగా పరిశ్రమల వర్గాల ప్రత్యేక ప్రయోజనానికై పరిశోధన పథకాలను చేపట్టుట.

3 కొత్త పరిశ్రమల ప్రారంభానికై పైలట్ పథకాలను నెలకొల్పి తద్వారా అట్టి యూనిట్ల స్థాపనకై ప్రైవేటు పారిశ్రామికులకు ప్రోత్సాహ మిచ్చుట.

ఇప్పటికి యీ దిగువవి నెలకొల్పబడి పని చేస్తున్నాయి:

1 శ్రీకాకుళం, ఏలూరు, గుంటూరు, కర్నూలు, కడప, నెల్లూరులలో 6 వడ్రంగం శిక్షణ-వుత్పత్తి కేంద్రాలు.

2. పై ప్రదేశాలలో కమ్మరంలో 6 శిక్షణ-వుత్పత్తి కేంద్రాలు.

3 రాజమండ్రీలో సుద్దపుల్లలు యితర సున్నం వస్తువుల తయారీ కేంద్రం.

4 విజయవాడలో శిక్షణా-వుత్పత్తి కేంద్రం.

5 గూడూరులో వైజ్ఞానిక గాజు పరికరాల తయారీ శిక్షణా కేంద్రం.

6 కాకినాడలో బ్రష్‌ల తయారీ యూనిట్టు

7 ముషీరాబాదులో విద్యుచ్ఛక్తితోనడిచే యంత్రాలను నడుపుటలో శిక్షణ యిచ్చే కేంద్రం.

8 హైదరాబాదులో యుటిలిటీ తోలువస్తువుల కేంద్రం.

9 హైదరాబాదులో 20 సహకార పని కేంద్రాలు.

10 సిద్దిపేటలో యిత్తడి సామానుకై సహకార పని కేంద్రం.

11 విశాఖపట్నంలో వడ్రంగంలో వుత్పత్తి-శిక్షణా కేంద్రం.

12 విజయవాడలో నమూనా తోలు వస్తువుల తయారీ యూనిట్టు.

13 పోడూరులో కత్తుల తయారీ కేంద్రం.

పై పథకాలలో పెక్కు ప్రస్తుతం అద్దె యిళ్లల్లో పని చేస్తున్నాయి. శాశ్వత భవనాల నిర్మాణం పూర్తికావస్తున్నది. ఆయా కేంద్రాలు యీ సంవత్సరంలో శాశ్వత భవనాలలోనికి తరలించబడతాయి.

పై కేంద్రాలకితోడు దిగువ కేంద్రాల స్థాపన చేబట్టబడింది. శాశ్వత భవనాల నిర్మాణం, యంత్రాల కొనుగోలు, సిబ్బంది నియామకం మున్నగు పనులు జరుగుతున్నాయి.

1 అనకాపల్లి, విజయనగరాలలో రాతి వస్తువులు, మట్టివస్తువుల తయారీకై 2 కేంద్రాలు.

2 చిత్తూరులో సంచార వడ్రంగం ప్రదర్శన యూనిట్టు.

3 హైదరాబాదులో సంచార కమ్మరం ప్రదర్శన యూనిట్టు.

4 గూడూరులో ఎనామిల్ వస్తువులకై శిక్షణా-వుత్పత్తి కేంద్రం.

5 రాజమండ్రీలో గ్రాఫైటుమూస పరిశ్రమలో పరిశోధన కేంద్రం.

6 వరంగల్లులో నమూనా చర్మకార పరిశ్రమ కేంద్రం.

7 పది సహకార పని కేంద్రాలు.

8 ద్రోణాచలంలో పింగాణీ వస్తువుల వుత్పత్తి-శిక్షణా కేంద్రం.

9 విజయవాడలో సైకిలు విడిభాగాల ఫ్యాక్టరీ.

10 ధవళేశ్వరంలో బిల్డర్సు హార్డువేర్.

11 ఏలూరులో పాదరక్షల కేంద్రం, నమూనా చర్మకార పరిశ్రమ కేంద్రం.

12 గుంతకల్లులో నమూనా చర్మకార పరిశ్రమ కేంద్రం.

13 పెందుర్తిలో పెంకుల శిక్షణా వుత్పత్తి కేంద్రం.

14 వరంగల్లు (మహబూబాబాదు) లో రంపంమిల్లు-కలపసీజనింగు ప్లాంటు.

15 వరంగల్లు, ఖమ్మంమెట్టులలో 2 నమూనా వడ్రంగం వర్కుషాపులు.

16 పైప్రదేశాలలో 2 కమ్మరం వర్కుషాపులు.

17 గుంతకల్లులో హోయిసరీ యూనిట్టు (పథకం పునః పరిశీలింప బడుతున్నది.

18 రాజమండ్రీలో రాతిగొట్టాల ఫ్యాక్టరీ.

19 తాడేపల్లిగూడెం, కడపలలో 2 సాధారణ ప్రయోజన ఇంజనీరింగు వర్కుషాపులు.

20 ములుగ్‌లో కొయ్యబద్దలు, కొయ్యపలకల (స్ప్లింట్సు, వీనర్సు) ఫ్యాక్టరీ.

దిగువ 4 పథకాలు యిటీవలే మంజూరు చేయబడినవి. వాటి అమలుకై చర్యకూడ తీసుకొన బడుతున్నది.

1 చిన్నతరహా, కుటీర పరిశ్రమల పరిశోధన సంస్థ.

2 స్మాల్ గేజ్ ఇన్సులేటెడ్ రాగితీగల తయారీ.

3 ఫ్రాక్షనల్ హెచ్. పి. మోటార్ల తయారీ.

4 రేడియో విడిభాగాలు, రేడియోసెట్ల తయారీ.

ఆమోదింపబడిన ప్రణాళికలో వసతి ప్రకారం యీసంవత్సరం పై పథకాలన్నిటికి మొత్తం రూ. 33.15 లక్షలు ఖర్చుకాగలదని భావించబడుతున్నది.

## చిన్నతరహా ప్రైవేటు పరిశ్రమలకి అప్పులు

పరిశ్రమలకి ప్రభుత్వ సహాయ చట్టంక్రింద కుటీర, చిన్నతరహా పారిశ్రామికులకు పెట్టుబడి, తదితర ఖర్చులకు మధ్యకాలిక, దీర్ఘకాలిక ఋణాలు యివ్వబడుతున్నాయి. ఈ పద్దుక్రింద యీ సంవత్సరం రూ. 14 లక్షలను పంపిణీ చేయాలని సంకల్పించబడింది.

ఆమోదింపబడిన ప్రణాళికలు, పారిశ్రామిక కేంద్రాలకి కావలసిన సొమ్ముకాక, డిపార్టుమెంటల్ చిన్నతరహా పరిశ్రమల పథకాలు, అజమాయిషీ సిబ్బందిఖర్చు, పరిశ్రమలకు ప్రభుత్వ సహాయ చట్టం క్రింద అప్పుల మంజూరులకై మొత్తం రూ. 30లక్షలు కావాలి. ఇందులో రూ. 7.5 లక్షల్ని గ్రాంటుగాను, రూ. 22.5 లక్షల్ని అప్పుగాను యిచ్చుటకు కేంద్ర ప్రభుత్వం సమ్మతించింది. పై అన్నిపద్దుల క్రింద ఖర్చు వసతిని హెచ్చించవలసిన అవసరంగురించి కేంద్ర ప్రభుత్వానికి తెలియచేయబడింది. ఈ సంవత్సరం చిన్నతరహా పరిశ్రమలకి బడ్జెట్టులో రూ. 58.00 లక్షలు కేటాయించబడగా 1958 సెప్టెంబరు నెలాఖరుకి బ్లాకు అప్పులు రూ. 1.43 లక్షలతో సహా రూ. 9.09 లక్షలు ఖర్చుచేయబడినవి.

## చేతిపనులు

చేతిపనులు మన సాంస్కృతిక పూర్వసంపదలో ఒకభాగంగా పరిగణింపబడాలి. వంశపారంపర్యా వచ్చే చేతిపనివారికి పని కల్పించుటలోనే వాటి ప్రాముఖ్యం యిమిడివుండలేదు. ఒక తరం సంస్కృతీ నాగరికతలను, ఆశాభయాలను కళాత్మకంగా ప్రతిఫలింపచేసే సామర్థ్యంవుంది వాటికి. ఇదేవాటి ప్రాముఖ్యానికి యెక్కువ కారణం. దేశవాళీ మట్టి, గుడ్డపీలికలు, దారం, గడ్డి, ఆకులు, కొయ్యముక్క, వనస్పతి రంగులు యివే సృజనాత్మకమయిన మన



13-12-58 న హైదరాబాదులో రాష్ట్రపతి ముఖ్యమంత్రి 4 వ అఖిలభారత చేతిపనుల ప్రదర్శనను ప్రారంభించారు.

స్సుకి, భావాలకు రూపాన్నిచ్చే చేతులకు ముడి పదార్థాలయినవి. నమూనాలకి ఖనిస్తైఎందరో చేతిపనివారికి నేటికీ ప్రోత్సాహాన్ని కల్పించే అమరావతి ఎల్లోరా, అజంతా శిల్పాలు ఆంధ్రప్రదేశ్ చేతి పనివారి తాతముత్తాతలు పెట్టిన భిక్షయే.

మన చేతి పనుల నమూనా, రంగు, స్వరూపం శతాబ్దాల తరబడి జరిగిన ప్రయోగాలు, పరిణామం ఫలితంగా పరిపూర్ణత నొందాయి. ఎన్నడూ నల్లబడని నిర్మల్ బంగారు తయారీ, బిద్రీ వస్తువులను గారడీగా నలుపుచేయడం, బొమ్మలకి కొయ్యయెన్నిక, కేవర ఆకులతో లక్కవస్తువులకు మెరుగు పెట్టుట, గొర్రెబొచ్చుతో తివాసీలనేత యివి సుదీర్ఘ కాలంలో అభివృద్ధిచెందిన చేతిపనులు.

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక అభివృద్ధి కార్యక్రమంలో చేతిపనులకు విశిష్టమయిన స్థానం వున్నది. వాటి అభివృద్ధికై రాష్ట్ర ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో రూ. 35.05 లక్షలు కేటాయించబడినవి. ఇప్పటికే చాలావరకు పని జరిగింది. 17 పథకాలు మొత్తం రూ. 3,39,414/- ఖర్చుపై అమలు జలుగుతున్నాయి. ఈ పథకాలక్రింద చేతిపనివారి సహకార సంఘాలు యేర్పాటు చేయబడినవి. వాటి నిర్వహణకి అవసరమైన సొమ్మును అప్పుగా యిచ్చి ముఖ్యమయిన సిబ్బందిని యిచ్చి వాటికి తోడ్పడ్డం జరుగుతున్నది. ఈ సంఘాలు వుత్పత్తి పనిని చేపట్టాయి. చేతిపనివారికి క్రమబద్ధంగా పని దొరుకుతున్నది. వెండినగిషీ వస్తువులు, నిర్మల్, కొండపల్లి, ఏటికొప్పాక, తిరుపతి బొమ్మలు, బిద్రీవస్తువులు, హిమ్రూవస్తువులు, వరంగల్లు తివాసీలు, వెదురు వస్తువులు, దంతం, కొమ్ముపని, చాపల అల్లకం మున్నగు చేతిపనుల అభివృద్ధికై గత 2 సంవత్సరాలలోను రూ. 6.56 లక్షలపై 23 పథకాలు చేపట్టబడినవి. హైదరాబాదు, విజయవాడ, తిరుపతి లలోని ప్రభుత్వ కుటీర పరిశ్రమల అమ్మకం డిపోలను విస్తరింపజేసి తద్వారా వస్తు విక్రయ సమస్యకూడా పరిష్కరించబడింది. గత రెండు సంవత్సరాలలోను చేతిపనులపై 4 లక్షలు ఖర్చు చేయబడ్డాయి. 1958-59 ప్రణాళికం కార్యక్రమంలో రూ. 4.50 లక్షలు కేటాయించబడ్డాయి. ఇందులో 17 పథకాలకి 3,39,414 మంజూరు అయినవి. ఈ సంవత్సరం మంజూరయిన పథకాలపై బడ్జెట్టు కేటాయింపు రూ. 4.50 లక్షలలో 1958 సెప్టెంబరు ఆఖరునాటికి రూ. 0.59 లక్షలు కేటాయించబడ్డాయి.

ఆంధ్రప్రదేశ్ చేతిపనుల సలహాసంఘం పునర్నిర్మాణంతో యింకా యెక్కువ ఫలితాలు సాధించబడతాయనీ, యీసంఘం సభ్యుల సలహా చేతిపనుల అభివృద్ధిలో ప్రభుత్వానికి మిక్కిలి తోడ్పడగలదనీ భావించబడుతున్నది.

## 1958 లో అమలులోవున్న చేతిపనుల పథకాలు

| వరుస సంఖ్య | పథకం పేరు | | పథకం మొత్తం ఖర్చు రూ. |
|---|---|---|---|
| 1. | వరంగల్లులో తివాసీల పరిశ్రమ అభివృద్ధి పథకం | ... | 2,940 |
| 2. | మహబూబునగరంలో చాపల అల్లకం పరిశ్రమ అభివృద్ధి పథకం | ... | 3,000 |
| 3. | కరీంనగరంలో వెండినగిషీ పరిశ్రమ అభివృద్ధి పథకం | ... | 3,000 |
| 4. | సికిందార్రాబాదులో దంతం, కొమ్ము పరిశ్రమ పథకం | ... | 10,860 |
| 5. | జనగాంలో పూసలపని అభివృద్ధి పథకం | ... | 5,400 |
| 6. | హిమ్రూ పనివారికి సమిష్టి సౌకర్యం, గృహవసతి కాలనీ | ... | 32,850 |
| 7. | బిద్రీ చేతిపనివారికి గృహవసతి సౌకర్యాలు, సమిష్టి వుత్పత్తి కార్యక్రమం యేర్పాటు పథకం | ... | 36,100 |
| 8. | తిరుచానూరులో కొయ్యబొమ్మల పరిశ్రమ పథకం | ... | 8,560 |

| | | | |
|---|---|---|---|
| 9. | వెదురు, పేముబుట్టల అల్లకం పరిశ్రమ (3 కేంద్రాలు)ను నెలకొల్పేపథకం | ... | 18,000 |
| 10. | తిరుపతి అమ్మకం ఎంపోరియం పథకం | ... | 8,000 |
| 11. | ఏటికొప్పాకలో కొయ్యబొమ్మల పథకం | ... | 19,000 |
| 12. | గుంతకల్లు, అరకులలో వెదురు, బుట్టల అల్లకం పథకం | ... | 13,558 |
| 13. | విశాఖపట్నంలో దంతం, తాబేటిచిప్ప, కొమ్ముపరిశ్రమ పథకం | ... | 10,500 |
| 14. | కొండపల్లి, బొమ్మల తయారీ పథకం | ... | 10,200 |
| 15. | చేతిపనుల సర్వే పథకం | ... | 19,419 |
| 16. | ఏలూరులో కేంద్ర వున్ని, రంగులువేయు కేంద్రం పథకం | ... | 8,000 |
| 17. | వరంగల్లు, విశాఖపట్నాలలో రెండు రెండవతరగతి సేకరణ-అమ్మకం డిపోల ప్రారంభం | ... | 1,30,000 |
| | | మొత్తం | 3,39,414 |

## పట్టు పరిశ్రమ

ఇరుగు పొరుగు రాష్ట్రాలయిన మద్రాసు, మైసూరులతో పోల్చినప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో పట్టు పరిశ్రమ శైశవావస్థలో వుంది. అది ఆదర్శప్రాయమయిన పరిశ్రమ. రైతుల గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో చక్కగా యిమిడి వారికి వుపవృత్తిని సమకూరుస్తుంది. ఈ పరిశ్రమద్వారా గ్రామీణులు తమ తీరిక కాలాన్ని వుపయోగకరంగా లాభదాయకంగా వినియోగించుకోవచ్చు. ముఖ్యంగా స్త్రీలు సహజసిద్ధమయిన నేర్పు, ఓరిమిలతో యింటిపనులకు తోడు పట్టుపురుగుల పెంపకాన్ని చేపట్టవచ్చు.

పట్టుపరిశ్రమ సర్వతోముఖాభివృద్ధికై రాష్ట్రీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో రూ. 21.38 లక్షలు కేటాయించబడినవి.

గడచిన రెండుసంవత్సరాలలోను జరిగిన ఖర్చు వివరాలు యివి :

| | |
|---|---|
| 1956-57 | 1.00 848 లక్షలు |
| 1957-58 | 2.44 ,, |

1956 లో ఆంధ్రప్రదేశ్‌లో పట్టుపరిశ్రమ అభివృద్ధికై ప్లానింగు కమిషన్ రూ. 5 లక్షల్ని గరిష్ఠ మొత్తంగా నిర్ణయించింది.

1958-59 ప్రణాళికా కార్యక్రమంలో చేర్చబడిన పథకాలు యివి :

1. హిందూపురం (అనంతపురం జిల్లా) లో గ్రైనేజి స్థాపన పథకం.

రాష్ట్రంలో పట్టుపురుగు విత్తనాలను వుత్పత్తి చేసి, మల్బరీ తోటలుగల రైతులకు వ్యాధిరహితమయిన పట్టుపురుగు విత్తనాలను సరఫరా చేసే అవకాశం కల్పించి ఆవిధంగా విత్తనం వుత్పత్తి విషయంలో రాష్ట్రాన్ని స్వయంసమృద్ధంచేసి విత్తనాలకై యితరరాష్ట్రాలపై ఆధారపడి వుండకుండా చేయుట యీపథకం ఆశయం. గ్రైనేజి భవనం నిర్మాణం యీపథకం ముఖ్యాంశం.

పథకం ఖర్చు :

| | |
|---|---|
| ఒక్కసారి అయేది | రూ. 27,500 |
| మళ్ళీ మళ్ళీ అయేది | రూ. 5,300 |
| మొత్తం | రూ. 32,800 |

31-3-1958 నాటికివ్యాధి రహితమయిన విత్తనాలు మొత్తం 22,435 సరఫరా చేయబడ్డాయి.

2. హిందూపురం (అనంతపురం) లో ప్రాతిపదిక విత్తనం క్షేత్రం (స్థానిక) స్థాపన పథకం.

ఈ పథకంలో స్థానిక ప్రాతిపదిక విత్తనాలు, మిశ్రమ వుత్పత్తికి అవసరమయిన విత్తనం పురుగుల

వుత్పత్తి తలపెట్టబడింది. 5 యెకరాల మల్బరీతోట యేర్పాటు, బావి నిర్మాణం, పెంపకం కేంద్రం నిర్మాణం యీ పథకం ముఖ్యాంశాలు.

31-3-1958 నాటికి స్థానిక జాతి విత్తనం పురుగులు మొత్తం 64,150 వుత్పత్తి చేయబడ్డాయి.

పథకం ఖర్చు :

| | | |
|---|---|---|
| ఒక్కసారి అయేది | రూ. | 37,000 |
| మళ్ళీ మళ్ళీ అయేది | రూ. | 2,500 |
| మొత్తం | రూ. | 39,500 |

3. ప్రస్తుతపు పలమనేరు ప్రభుత్వ పట్టుక్షేత్రానికి సౌకర్యాల కల్పన కుద్దేశించబడిన పథకం.

ఈ పథకంలో మిశ్రిమ వుత్పత్తి ప్రయోజనాలకై వుత్తమ పరిస్థితులలో విదేశ జాతుల పెంపకానికై పెంపకం కేంద్రం నిర్మాణం, బావినిర్మాణం, 2 యెకరాల మల్బరీతోట యేర్పాటు తలపెట్టబడినవి.

పథకం ఖర్చు :

| | | |
|---|---|---|
| ఒక్కసారి అయేది | రూ. | 36,000 |
| మళ్ళీ మళ్ళీ అయేది | రూ. | 2,000 |
| మొత్తం | రూ. | 38,000 |

4. అనంతపురం జిల్లా హిందూపురం, చిత్తూరుజిల్లా పలమనేరులలో దారం యూనిట్ల స్థాపన పథకం.

ఇదివరకూ పట్టుపురుగులు ప్రక్క రాష్ట్రిం మైసూరులోని దారం తీయువారికి అమ్మబడేవి. అందువల్ల పెంపకందారులకు సరసమయిన ధరలు కిట్టేవికాదు. ఈ చిక్కును తొలగించి, అమ్మకానికి వసతి కల్పించుటకై యీ పథకం చేపట్టబడింది. పెంపకందారులు తయారుచేసిన పట్టుపురుగులన్నిటిని ప్రభుత్వంచే కొనుగోలుకి, ప్రభుత్వపరంగా దారం తయారీకి యీ పథకం వుద్దేశించబడింది. ఇందు నిమిత్తం హిందూపురం, పలమనేరులలో దారంతీసే యంత్రాలు 2 నెలకొల్పబడినవి. పట్టు పురుగులను కొని ప్రభుత్వపరంగా దారంతీసే విషయంలో ఖర్చుకై రూ. 15,000 కేటాయించబడ్డాయి.

పథకం ఖర్చు :

| | | |
|---|---|---|
| ఒక్కసారి అయేది | రూ. | 8,000 |
| మళ్ళీ మళ్ళీ అయేది | రూ. | 2,300 |
| నిర్వహణ ఖర్చు | రూ. | 15,000 |
| మొత్తం | రూ. | 25,000 |

5. ఏజన్సీలో పట్టు పరిశ్రమ అభివృద్ధి.

విశాఖపట్నం జిల్లా చింతపల్లి, అరకులోయ ఏజన్సీ ప్రాంతాలలో యిదివరకే పట్టు పరిశ్రమ క్షేత్రాలు వున్నాయి. అలాగే తూర్పుగోదావరి జిల్లా నూగూరు తాలూకా వెంకటాపురంలో యేజన్సీలో టస్సర్ పరిశ్రమ అభివృద్ధికై ప్రచార కేంద్రం కూడా. పై యేజన్సీ ప్రాంతాలలో యీ పరిశ్రమ అభివృద్ధికై రాష్ట్రి ప్రభుత్వం యిటీవలనే షెడ్యూల్డు జాతుల మేలుకై దిగువ పథకాలను మంజూరుచేసింది.

| | |
|---|---|
| చింతపల్లిలో విదేశ జాతుల పోషణకై ప్రాతిపదిక విత్తనాల క్షేత్రం | 51,300/- |
| అరకులోయలో పట్టుక్షేత్రం స్థాపన పథకం | 36,500/- |
| వెంకటాపురం ఏజన్సీలో టస్సర్ పెంపకం అభివృద్ధి పథకం | 64,200/- |

1958-59 లో అమలుకై దిగువ కొత్త పథకాలను కూడా ప్రభుత్వం మంజూరుచేసింది :

| పథకం పేరు | ఒక్కసారి అయే ఖర్చు | మళ్ళీ మళ్ళీ అయే ఖర్చు | మొత్తం |
|---|---|---|---|
| 1. హిందూపురం పట్టు పారిశ్రామికులకు సాంకేతిక సహాయం సమకూర్చే పథకం | 540 | 6352 | 6892 |
| 2. చిత్తూరుజిల్లా పుంగనూరులో మల్బరీ తోటలను విస్తరించి పట్టుపురుగుల వుత్పత్తిని హెచ్చించుటకై ప్రచార కేంద్రాల స్థాపన పథకం | 1540 | 1404 | 2944 |
| 3. టస్సర్, యెరీకల్చర్ లలో శిక్షణకై యితర రాష్ట్రాలకి అధికారులను పంపుట | 4400 | — | 4400 |
| 4. పుంగనూరులో చాకీ పెంపకం యూనిట్టు స్థాపన | 1000 | 5000 | 6000 |
| 5. చింతలపూడిలో (ప. గో. జిల్లా) దారంతీయుటకు, నీటి పారుదలకి సౌకర్యాల కల్పన | 6500 | — | 6500 |

తిరుమలలో రూ. 33,000 ఖర్చుపై విదేశజాతి విత్తనం పురుగుల వుత్పత్తి, విత్తనాల వృద్ధిక్షేత్రాన్ని ప్రారంభించాలనే ప్రతిపాదన కూడా వున్నది. ఈ పథకం కేంద్ర పట్టుసంఘం పరిశీలనలో వున్నది.

6. హిందూపురంలో అంటు పెంపక కేంద్రం.

పది యెకరాల తోటలో మేలిరకం మల్బరీ అంటులను పెంచి, మల్బరీ తోటల విస్తరణకై వాటిని రైతులకు పంపిణీచేయుట యీ పథకం ఆశయం. పది యెకరాల మల్బరీ నారుపెంపక కేంద్రం స్థాపన, నీటి పారుదల సౌకర్యాల కల్పన, గ్రాఫ్టింగుషెడ్డు నిర్మాణం యీ పథకం ముఖ్యాంశాలు.

16,000 స్థానిక, 9,000 బరంపురం నారు మొక్కలు పెరుగుతున్నాయి.

పథకం ఖర్చు :

| | | |
|---|---|---|
| ఒక్కసారి అయేది | రూ. | 28,000 |
| మళ్ళీ మళ్ళీ అయేది | రూ. | 10,100 |
| మొత్తం | రూ. | 38,100 |

7. కర్నూలు జిల్లా ప్యాపలిలో ప్రయోగాత్మకమైన యెరీ విత్తనాల క్షేత్రం స్థాపన.

రాష్ట్రంలో విస్తార ప్రదేశాలలో ఆముదంచెట్లు పెరుగుతున్నందున మల్బరీయేతర పట్టు పరిశ్రమ అభివృద్ధికి చాల అవకాశం వుంది. రాష్ట్రంలో యెరీ కల్చరికి దోహదమిచ్చుటకై ఈ పథకంలో ప్రయోగాత్మకమైన యెరీ విత్తనం క్షేత్రాన్ని ప్రారంభించాలని తలపెట్టబడింది. ఆముదంతోట యేర్పాటు, పెంపకం కేంద్రం నిర్మాణం, నీటి పారుదల సౌకర్యాల కల్పన యీ పథకం ముఖ్యాంశాలు.

పథకం ఖర్చు :

| | | |
|---|---|---|
| ఒక్కసారి అయేది | రూ. | 27,000 |
| మళ్ళీ మళ్ళీ అయేది | రూ. | 4,700 |
| మొత్త | రూ. | 31,700 |

8. రెండు పాఠశాలల్లో పట్టుపరిశ్రమను వృత్తిగా ప్రవేశపెట్టే పథకం.

మల్బరీతోటలు విస్తారంగాగల ప్రాంతాలలోని రెండు ప్రాథమిక పాఠశాలల్లో పట్టు పరిశ్రమ విధానాన్ని ప్రత్యక్షంగా బోధించి ఆ విధంగా విద్యార్థులు స్వంతంగా యీ పరిశ్రమను చేపట్టే అవకాశం కల్పించుట యీ పథకం ఆశయం. ప్రదర్శన ప్రయోజనాలకై హిందూపురం సేవామందిరం వృత్తి విద్యా పాఠశాలలో ఒకటి, చిత్తూరు జిల్లా

వాయల్పాడు తాలూకా చింతపర్తి గ్రామంలో ఒకటి రెండు చిన్న మల్బరీతోటలు వేయబడినవి.

పదకం ఖర్చు :

| | | |
|---|---|---|
| ఒక్కసారి అయేవి | రూ. | 1,000 |
| మళ్ళీ మళ్ళీ అయేవి | రూ. | 1,900 |
| మొత్తం | రూ. | 2,900 |

నిజామాబాదు జిల్లా బికనీరు శిక్షణ-ప్రదర్శన పథకం 1955-56 నుంచి అమలుజరుగుతున్నది. ప్రత్యక్ష ప్రదర్శనలద్వారా పట్టు పరిశ్రమను వ్యాప్తి నొందించాలని సంకల్పించబడింది. నెలకి రూ. 20 స్టయిపెండుపై యేటా 12 మందికి శిక్షణయిచ్చే అవకాశం వుంది.

పై పథకానికి తోడు 1957-58 లో రాష్ట్ర ప్రభుత్వం మరొక పథకాన్ని మంజూరుచేసింది. నమూనా పెంపకం కేంద్రం, గ్రైనేజ్ భవనాల సౌకర్యాలతో మొత్తం రూ. 57,000 ఖర్చుపై ప్రాతిపదిక విత్తనాల కేంద్రాన్ని నెలకొల్పుట యీ పథకం ఆశయమైవున్నది. అది అమలుజరుగుతున్నది.

## మనైరీ

కరీంనగరం జిల్లాలో యీ పరిశ్రమ అభివృద్ధికై రాష్ట్రప్రభుత్వం 1957-58 లో దిగువ 2 పథకాలను మంజూరుచేసింది :

| | ఒక్కసారి అయే ఖర్చు | మళ్ళీ మళ్ళీ అయే ఖర్చు | మొత్తం |
|---|---|---|---|
| మనైర్ ప్రభుత్వ పట్టు క్షేత్రాన్ని బలపరిచే పథకం | 9,500 | 27,304 | 36,804 |
| మనైర్‌లో మల్బరీనారు పెంపక కేంద్రం స్థాపన | 11,000 | 7,000 | 18,000 |

ఈ పథకాలు అమలుజరుగుతున్నాయి.

## సల్వాయ్ (వరంగల్లు జిల్లా)లో

సల్వాయ్ పట్టు కేంద్రాన్ని బలపరుచుటకై 1957-58 లో ప్రభుత్వం మొత్తం రూ. 46,537 (ఒ. అ. ఖర్చు రూ. 26,000, మ. మ. అ. ఖర్చు రూ. 20,537) మంజూరుచేసింది. ఇందులో రూ. 20,000 తో నమూనా పెంపకం కేంద్రాన్ని నిర్మించే అవకాశంవుంది.

మల్బరీతోట వేయబడింది. పెంపకం కేంద్రం నిర్మాణం జరుగుతున్నది. ఈ పథకం 1958-59 లో కొనసాగించబడుతున్నది.

## టస్సర్ పరిశ్రమ అభివృద్ధి

వరంగల్లు, కరీంనగరం జిల్లాల్లో విస్తారమైన అరణ్యాలున్నాయి. అక్కడ నల్లమద్దిచెట్లు పుష్కలంగా పెరుగుతాయి. కాబట్టి తెలంగాణాలో టస్సర్ సిల్కు పరిశ్రమ అభివృద్ధికి చక్కని అవకాశాలున్నాయి. ఈ పరిశ్రమ అభివృద్ధికై ప్రభుత్వం దిగువ పథకాలను మంజూరుచేసింది.

| పథకం పేరు | ఒక్కసారి అయే ఖర్చు | మళ్ళీ మళ్ళీ అయే ఖర్చు | మొత్తం |
|---|---|---|---|
| మహాదేవపురం (క.న.జి.) టస్సర్ విత్తనాల కేంద్రం స్థాపన | 20,000 | 18,089 | 38,089 |
| వెంకటాపురంలో టస్సర్ విత్తనాల కేంద్రం స్థాపన | 35,000 | 19,129 | 54,129 |

ఈ పథకాలు అమలు జరుగుతున్నాయి.

## ఎరీ పట్టు పరిశ్రమ

ఆముదంతోటలను ఉత్తమంగా ఉపయోగించే అవకాశాల పరిశీలనకై ప్రభుత్వం మహబూబునగరం

జిల్లా షాద్‌నగరంలో యెరీ విత్తనాల క్షేత్రాన్ని రూ. 20,301 (ఒ. అ. ఖర్చు రూ. 5,000/-, మ. మ. ఖర్చు రూ. 15,301.4.0) పై నెలకొల్పే పథకాన్ని మంజూరు చేసింది. ఈ పథకం అమలు జరుగుతున్నది.

పట్టు అధికారి పరిశీలనార్థం యితర రాష్ట్రాలలో పర్యటించి, అక్కడి ఆధునిక పద్ధతులలో యీ పరిశ్రమను అభివృద్ధి చేయుటకు అవకాశం కల్పించుటకేమి, క్రొత్త అభ్యర్థుల శిక్షణకేమి ప్రభుత్వం రూ. 5,270 ఖర్చుపై ఒక పథకాన్ని మంజూరు చేసింది. ఇదికూడా అమలు జరుగుతున్నది.

మల్బరీ తోటలక్రింద యించుమించు 700 యెకరాలు వున్నాయి. కరీంనగరం, వరంగల్లు, తూర్పు గోదావరి జిల్లాల అడవుల్లో నల్లమద్దిచెట్లు విస్తారంగా వున్నందున టస్సర్ పరిశ్రమ అభివృద్ధి చాల అవకాశం వుంది. ప్రభుత్వం పట్టుపురుగులను నేరు రొఖ్ఖం ప్రాతిపదికపై కొంటున్నది. ఆర్మూరు, ధర్మవరం, సిద్దిపేటలు మల్బరీ పట్టు కేంద్రాలుగా వున్నవి.

ఈ సంవత్సరం బడ్జెటు కేటాయింపు రూ. 5.00 లక్షలుకాగా 1958 సెప్టెంబరు నెలాఖరికి పట్టు పరిశ్రమ పథకాలపై రూ. 0.75 లక్షలు ఖర్చు చేయబడినవి.

ఖాదీ, గ్రామ పరిశ్రమల కమిషన్ అధ్వర్యాన ప్రారంభమయిన బెల్లం, ఖండసరి పథకంక్రింద పని ఆంధ్రప్రదేశ్ యేర్పడిన రెండవ సంవత్సరంలో దిగువ 5 నిర్ణీత తాలూకాలలోను కొనసాగినది.

1. చిత్తూరు జిల్లా చిత్తూరు తాలూకా.
2. అనంతపురం జిల్లా హిందూపురం తాలూకా.
3. తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకా.
4. అనకాపల్లి
5. విశాఖజిల్లా చోడవరం.

ఈ పని 5 తీవ్ర, 15 విస్తృత కేంద్రాలలో కొనసాగింది. వాటిక్రింద 32,649 యెకరాల చెఱకు పొలాలు వున్నాయి. ఈ పథకంక్రింద నియమితులయిన (బెల్లం అభివృద్ధి) ఇనస్పెక్టర్లు, సహాయ ఇనస్పెక్టర్లు, డిమాన్‌స్ట్రేటర్లు, గైడ్‌లు, రసం వుడికించేవారు, మెకానిక్కులు ఆయా ప్రాంతాలలోని చెఱకు రైతులను కలుసుకుని బెల్లం, ఖండసరిల తయారీలో ఆధునిక విధానాలను ప్రవేశపెట్టారు. వారు ఆధునిక కొలిమిలను వుచితంగా నిర్మించారు. ఇందువల్ల వుత్పత్తి ఖర్చు 20% తగ్గింది. ప్రస్తుతపు చెఱకుగానుగలను మరమ్మతుచేసి, ఆధునికమయిన వాటిని ప్రవేశపెట్టారు. ఇందువల్ల సామర్థ్యం పెరిగింది. బెల్లాన్ని శుభ్రపరచే వస్తువులను సరైన వాటిని యెన్నడంతో బెల్లంనాణ్యం హెచ్చి మణుగు ధర రూ. 9,10 నుంచి రూ. 12,13 కి హెచ్చింది. పై అభివృద్ధుల ఫలితంగా రైతులకు అదనంగా రూ. 6 లక్షల వరకూ లాభించింది. ఈ పథకంక్రింద సిబ్బంది జీతభత్యాలు, అత్యవసర ఖర్చులక్రింద మొత్తం రూ. 73,257 మాత్రమే ఖర్చు అయినవి.

ఆధునిక పరికరాలను ప్రవేశపెట్టే తలంపుతో రైతులకు దిగువ ఆధునిక సాధనాల రూపంలో రూ. 51,399 అప్పుగా యివ్వబడినవి. దీనిపై వడ్డీలేదు. దానిని 5 సంవత్సరాలలో తిరిగి చెల్లించాలి.

1. 100% అప్పుపై 60 సుల్తాన్ (యెద్దు) గానుగలు.
2. 100% అప్పుపై 15 విద్యుచ్ఛక్తి గానుగలు.
3. 50% అప్పు, 50% సబ్సిడీపై 81 పెనాలు.

ఇవిగాక 40 మణుగుల సుక్లాయ్, (రసాన్ని తేటపరచేది), 31 గ్రేటింగ్సుకూడా రైతులకు వుచితంగా యివ్వబడ్డాయి.

బెల్లం, ఖండసరి పథకం ప్రారంభానికి ముందు ఆంధ్రలో ఖండసరి తయారీ తెలియదు. సిబ్బంది తీవ్ర ప్రదర్శనల ఫలితంగా రైతులు ఖండసరిని బాగా తయారుచేశారు. ఈ కాలంలో 35,000 పౌనుల ఖండసరి తయారు చేయబడింది.

ఆంధ్రప్రాంతం వివిధ ప్రాంతాలలో షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు జాతుల సంక్షేమానికై కేంద్ర ప్రభుత్వం దిగువ పథకాలను మంజూరుచేసింది :

## 1. ఆర్థికాభ్యున్నతి పథకాలు

దుస్తుల తయారీ కేంద్రాలు (11)

| | | |
|---|---|---|
| 1. పెందుర్తి | విశాఖ | జిల్లా |
| 2. శ్రీకాకుళం | శ్రీకాకుళం | ,, |
| 3. కాకినాడ | తూ. గో. | ,, |
| 4. తాడేపల్లిగూడెం | ప. గో. | ,, |
| 5. విజయవాడ | కృష్ణా | ,, |
| 6. మంగళగిరి | గుంటూరు | ,, |
| 7. ఉదయగిరి | నెల్లూరు | ,, |
| 8. దిగువమేఘం | చిత్తూరు | ,, |
| 9. కర్నూలు | కర్నూలు | ,, |
| 10. సోమ్మనదొడ్డి | అనంతపురం | ,, |
| 11. రాయచోటి | కడప | ,, |

ఈ పథకాలు 1956-57 లో మంజూరయినవి. 1957-58 శిక్షణా కార్యక్రమం పూర్తిగా కొనసాగింది. ఒక్కొక్క కేంద్రంలో 20 మంది అభ్యర్థులు శిక్షణ పొందుతున్నారు. శిక్షణలో విజయంపొందిన శిక్షితులకు 103 కుట్టు మిషన్లు పంపిణీ చేయబడినవి. శిక్షితులకి నెలకి రూ. 25 స్టయిపెందు యివ్వబడు తున్నది.

## 2. బుట్టలల్లకం కేంద్రాలు (2)

| | | |
|---|---|---|
| 1. చిత్తూరు | చిత్తూరు | జిల్లా |
| 2. కొత్తవలస | విశాఖ | ,, |

వీటిలో ఒక్కొక్క కేంద్రంలోను 12 మంది అభ్యర్థులు శిక్షణ పొందుతున్నారు. ఒక్కొక్కరికి నెలకి రూ. 25 స్టయిపెందు యివ్వబడుతున్నది.

## 3. వడ్రంగం శిక్షణాకేంద్రాలు (4)

| | | |
|---|---|---|
| 1. పెందుర్తి | విశాఖపట్నం | జిల్లా |
| 2. కాశీబుగ్గ | శ్రీకాకుళం | ,, |
| 3. సోమన్నదొడ్డి | అనంతపురం | ,, |
| 4. నంద్యాల | కర్నూలు | ,, |

ఒక్కొక్క కేంద్రంలోను 12 మంది అభ్యర్థులు నెలకి రూ. 30 చొప్పున స్టయిపెందు పొందుతూ శిక్షణ పొందుతున్నారు. శిక్షణకాలం ఒకసంవత్సరం.

## ఆంధ్రప్రాంతంలో షెడ్యూల్డు జాతుల సంక్షేమానికై కేంద్రప్రభుత్వం అధ్వర్యాన నడిచే అర్థికాభ్యున్నతి పథకాలు

| | శిక్షితుల సంఖ్య | స్టయిపెందు |
|---|---|---|
| 1. మందస, గుమ్మలక్ష్మీపురాలలో తాపీపని శిక్షణా కేంద్రం | 40 | 20/- |
| 2. మందసలో రాతిపనివారి శిక్షణాకేంద్రం | 20 | 30/- |
| 3. మందసలో వడ్రంగం శిక్షణ - వృత్తి కేంద్రం | 24 | 30/- |

### రాజ్యాంగం 275 (1) సూత్రాలక్రింద గ్రాంటు యిన్‌యెయిడ్

| | | |
|---|---|---|
| 1. విశాఖపట్నం జిల్లా అరకులో గ్రామ కుంభకార పరిశ్రమ కేంద్రం | 15 | 30/- |
| 2. విశాఖపట్నం జిల్లా చింతపల్లిలో బుట్టలల్లకం కేంద్రం | 15 | 30/- |

### ప్రణాళికా పథకాలు

| | | |
|---|---|---|
| 3. తూ. గో. జిల్లాలో కోర, తుంగలతో చాపల అల్లకం శిక్షణాకేంద్రం | 12 | 20/- |
| 4. విశాఖపట్నం పాడేరులో వెదురు, పేము బుట్టల అల్లకం శిక్షణాకేంద్రం | 15 | 20/- |
| 5. శ్రీకాకుళం జిల్లా లేవిడిలో శిక్షణ, ప్రదర్శన యూనిట్టు | 12 | 20/- |

## ఖాదీ కమిషన్ పథకం

| | శిక్షితుల సంఖ్య | స్టయిపెండు |
|---|---|---|
| 1. చిత్తూరులో గ్రామ కుంభకార పరిశ్రమ శిక్షణ-వృత్పత్తి కేంద్రం | 12 | 25/- |
| **రాష్ట్రప్రభుత్వం పెట్టుబడిపై నడిచే పథకాలు** | | |
| 1. ముషీరాబాదు గ్రామ పరిశ్రమల శిక్షణాకేంద్రం | 60 | 12.13.0 |
| 2. కరీంనగరం గ్రామ పరిశ్రమల అభివృద్ధి కేంద్రం | 24 | 8.9.0 |
| 3. వరంగల్లు గ్రామ పరిశ్రమల అభివృద్ధికేంద్రం | 30 | 8.9.0 |
| 4. మహబూబునగరం గ్రామ పరిశ్రమల అభివృద్ధి కేంద్రం | 30 | 8.9.0 |

వివిధ వృత్తులలో శిక్షణయిచ్చుటయే యీ కేంద్రాల స్థాపన ప్రధానాశయం.

### పైలట్ ప్రాజెక్టు ప్రాంతాలు

**కుటీర,** చిన్నతరహా పరిశ్రమల సమన్వయపూర్వక మయిన తీవ్ర అభివృద్ధికై రాష్ట్రంలో 2 పైలట్ ప్రాజెక్టులు ప్రారంభించబడ్డాయి. వీటిలో ఒకదానిలో కాకినాడ పెద్దాపురం కమ్యూనిటీ ప్రాజెక్టు, రెండవ దానిలో వరంగల్లు జిల్లా ములుగ్ అనంతర తీవ్ర అభివృద్ధి బ్లాకుచేరి వున్నాయి. మరిశ్రమల అభి వృద్ధికి, పరిశ్రమల తీవ్ర అభివృద్ధికి నమూనాలుగా వుపయోగ పడుటకు యేర్పరచబడిన వివిధ అఖిల భారత సంఘాలనుంచి ఆర్థిక సహాయాన్ని పొంది నిరుద్యోగులకు పని కల్పించుట, పూర్తికాలం పని లేనివారికి అదనపు పనిని కల్పించుట ఈ ప్రాజెక్టు ముఖ్యాశయాలు.

దిగువ పథకాలు అమలు జరుగుతున్నాయి :

### కాకినాడ పెద్దాపురం పైలట్ ప్రాజెక్టు

1. ఖాదీ కార్యక్రమం : ఈ కార్యక్రమంక్రింద 8,552 మందికి పని చూపించబడింది. వేతనాలపై 68,034 ఖర్చు చేయబడ్డాయి. 1957-58 లో 1,76,569 గజాల ఖాదీ వుత్పత్తి చేయబడింది. దీని విలువ రూ. 2,91,540.

2. ఖాదీ, గ్రామ పరిశ్రమల కమిషన్ అంబర్ చర్ఖా కార్యక్రమం : ఈ కార్యక్రమం క్రింద 56 పరిశ్రమాలయాలు ప్రారంభింప బడ్డాయి. 537 మందికి శిక్షణ యివ్వబడుతున్నది. అంబర్ చర్ఖాలు పరిశ్రమాలయాల క్రింద 56 గ్రామాలు వున్నాయి.

3. చేనేత పరిశ్రమ : కాకినాడ పెద్దాపురం పైలట్ ప్రాజెక్టు ప్రాంతంలోని చేనేత సహకార సంఘాలు సగటున యించుమించు రూ. 8 లక్షల విలువగల చేనేత వస్త్రాన్ని నేసి, యించుమించు రూ. 6 లక్షల విలువగల వస్త్రాన్ని అమ్మాయి.

రూ. 89,83,995 విలువగల చేనేత వస్త్రం నేయబడింది. రూ. 88,41,691 విలువగల బట్ట అమ్మబడింది.

4. పారిశ్రామిక సహకార సంఘాలు : దిగువ పేర్కొన్న వివిధ పరిశ్రమలకై దిగువ పారిశ్రామిక సహకార సంఘాలు ప్రారంభించబడ్డాయి :—

| పరిశ్రమ పేరు | ప్రారంభించిన సహకార సంఘాల సంఖ్య | సభ్యుల సంఖ్య | వాటా మూల ధనం |
|---|---|---|---|
| 1. గ్రామ నూనె పరిశ్రమ | 4 | 106 | 10,520 |
| 2. గ్రామ కుండల పరిశ్రమ | 5 | 186 | 4,600 |
| 3. గ్రామ చర్మకార పరిశ్రమ | 4 | 148 | 3,560 |
| 4. దంపుడుబియ్యం పరిశ్రమ | 3 | 167 | 2,421 |
| 5. గుల్లసున్నం పరిశ్రమ | 2 | 91 | 1,600 |

| పరిశ్రమ పేరు | ప్రారంభించిన సహకార సంఘాల సంఖ్య | సభ్యుల సంఖ్య | వాటా మూలధనం |
|---|---|---|---|
| 6. వీణల తయారీ | 1 | 12 | 910 |
| 7. అద్దకం, రంగులు | 1 | 50 | 2,900 |
| 8. వడ్రంగం | 1 | 25 | 1,000 |
| 9. మంగుళూరు పెంకుల పరిశ్రమ | 1 | 74 | 10,589 |
| 10. ఇదివరకే యేర్పరచబడివున్న సంఘాలు | 5 | 249 | 10,569 |
| మొత్తం | 27 | 1,112 | 46,628 |

## 5. ములుగు పైలట్ ప్రాజెక్టు ప్రాంతం

| పథకం/ఏజన్సీ పేరు | మంజూరయిన సొమ్ము | ఖర్చుపెట్టిన సొమ్ము |
|---|---|---|
| **I.** అఖిలభారత ఖాదీ, గ్రామ పరిశ్రమల కమిషన్ | రూ. | రూ. |
| 1. దంపుడుబియ్యం పరిశ్రమ | 14,950 | 2,924.15 |
| 2. కళేబరాల వినియోగంతో సహా చర్మకార పరిశ్రమ | — | — |
| i. తోలుతీత | 6,720 | — |
| ii. గ్రామ నమూనా తోలు పదును కేంద్రం | 18,000 | 765.25 |
| iii. చర్మకార పరిశ్రమ | 1,250 | 1,250.00 |
| 3. అగ్గిపెట్టెల కుటీర పరిశ్రమ | 45,000 | 14,783.76 |
| 4. సబ్బు పరిశ్రమ | 16,400 | 211.99 |
| 5. అట్ట చక్కీలు | 600 | 568.75 |
| **II.** అఖిలభారత చేనేత సంఘం | | |
| 1. చేనేత | 14,300 | 6,800.00 |
| **III.** అఖిలభారత చిన్నతరహా పరిశ్రమల సంఘం | | |
| 1. కొయ్యబద్దలు, కొయ్యపలకల (Splints and veneers) | 2,16,100 | 76,883.82 |
| **IV.** అఖిలభారత పట్టు సంఘం | | |
| 1. టస్సర్ సిల్కు పరిశ్రమ | 38,000 | 5,130.33 |
| పట్టు పరిశ్రమ | 41,000 | 6,228.06 |
| **V.** ప్రత్యేకం రాష్ట్ర ప్రభుత్వం పథకాలు | | |
| 1. ములుగ్ ఆర్. ఏ. సి. ఐ. కేంద్రం | 24,000 | 18,030.08 |

ఈ రాష్ట్రంలో ప్రాతిపదిక గ్రామ పరిశ్రమల అభివృద్ధికై అభివృద్ధి కేంద్రాల ప్రాంతంలోని పారిశ్రామిక సహకార సంఘాలు, సంస్థలకి ఆర్థిక సహాయం చేయుటకై బొంబాయిలోని అఖిలభారత ఖాదీ, గ్రామ పరిశ్రమల కమిషన్ రూ. 9,23,050/- లను (రూ. 3,37,550 గ్రాంటు, రూ. 5,85,500 అప్పు) యిచ్చింది. ఇందులో 1957-58 లో రూ. 76,140 (గ్రాంటు రూ. 23,490, అప్పు రూ. 52,650) మాత్రమే ఖర్చు చేయబడ్డాయి. మిగిలిన రూ. 8,46,910 (రూ. 5,32,850 అప్పు, రూ. 3,14,060 గ్రాంటు) లను జరిగే ఆర్థిక సంవత్సరంలో ఖర్చు చేయుటకు ప్రభుత్వం పరిశ్రమలు, వాణిజ్య డైరెక్టరుకి అధికారం యిచ్చింది. వివిధ పరిశ్రమలకి కేటాయించిన గ్రాంటులు, అప్పులలో మిగిలిన సొమ్ము వివరాలు దిగువ యివ్వబడినవి :

| | గ్రాంటు | అప్పు |
|---|---|---|
| 1. దంపుడుబియ్యం పరిశ్రమ | 10,180 | 40,000 |
| 2. చేతితో కాగితం తయారీ | 15,000 | 15,000 |
| 3. గ్రామ నూనె పరిశ్రమ | 41,200 | 1,56,250 |
| 4. గ్రామ తోలు పరిశ్రమ | 7,000 | — |
| 5. అగ్గిపెట్టెల కుటీర పరిశ్రమ | 1,44,000 | 2,16,000 |
| 6. తాటిబెల్లం పరిశ్రమ | 50,320 | 38,800 |
| 7. గ్రామ కుండల పరిశ్రమ | 5,500 | 15,500 |
| 8. సబ్బు పరిశ్రమ | 55,950 | 98,750 |
| 9. బెల్లం, ఖండసరి | 8,400 | 5,200 |
| | 3,14,060 | 5,32,850 |

మిగిలిన పై సొమ్ములో యింతవరకూ 37 పారిశ్రామిక సహకార సంఘాలు, సంస్థలకి రూ.1,24,980 గ్రాంటుగాను, రూ. 2,96,124.88 అప్పుగాను యివ్వబడినవి.

30-9-58 వరకూ వివిధ పరిశ్రమలకి పంపిణీచేసిన సొమ్ము వివరాలు దిగువ యివ్వబడినవి :

| | గ్రాంటు | అప్పు |
|---|---|---|
| 1. గ్రామ తోలు పరిశ్రమ | 7,000 | — |
| 2. అగ్గిపెట్టెల పరిశ్రమ | 64,800 | 97,200 |
| 3. సబ్బు పరిశ్రమ | 35,050 | 89,500 |
| 4. గ్రామ నూనె పరిశ్రమ | 8,430 | 84,844.88 |
| 5. దంపుడుబియ్యం పరిశ్రమ | 470 | 22,500 |
| 6. బెల్లం ఖండసరి పరిశ్రమ | 8,400 | 5,200 |
| 7. గ్రామ కుండలు పరిశ్రమ | 5,500 | 15,500 |
| | 1,24,980 | 2,96,124.88 |

1958-59 లో పారిశ్రామిక సహకార సంఘాలు, సంస్థలకి ఆర్థిక సహాయం చేయుటకై దిగువ మొత్తాలను కేటాయించమని ఖాదీ, గ్రామ పరిశ్రమల కమిషన్‌ని కోరడం జరిగింది :

| | గ్రాంటు | అప్పు |
|---|---|---|
| 1. సబ్బు పరిశ్రమ | | |
| 2. బెల్లం, ఖండసరి పరిశ్రమ | 39,350 | 69,250 |
| 3. గ్రామ తోలు పరిశ్రమ | 8,942 | 5,200 |
| 4. దంపుడుబియ్యం పరిశ్రమ | 1,13,250 | 1,24,575 |
| 5. గ్రామ కుండల పరిశ్రమ | 19,540 | 52,500 |
| 6. తాటిబెల్లం పరిశ్రమ | 15,270 | 4,380 |
| 7. గ్రామ పరిశ్రమ | 40,650 | 50,000 |
| మొత్తం | 3,05,572 | 3,44,155 |

-:0:-

# తాళ వృక్షం

(శ్రీ వై. భాస్కరరావు, ఎస్. ఇ. ఓ., మిర్జాపురం బ్లాకు)

దక్కన్ పీఠభూమి దక్షిణప్రాంతంలో తాటిచెట్లు సర్వసాధారణం. ఇవి పొడుగ్గా సన్నంగా వున్నా బలమైనవి. ప్రాచీనమైనవి. 50, 60 అడుగుల యెత్తువరకూ పెరుగుతాయి. విస్తారంగా పెరిగే యీచెట్లు సాధారణంగా యిసుకనేలలు, మెత్తని నేలల్లో పెరుగుతాయి.

తాటిచెట్లు సహజంగా చాలవిధాల వుపకరిస్తాయి. బహుళార్థ ప్రయోజనకారులయిన యీ చెట్లు సిద్ధమయిన వస్తువులను తయారుచేసే యంత్రాగారం వంటివి. ఒక్కతేడామాత్రం వుంది. అదేమిటంటే వుపయోగకరమయిన వస్తువుల తయారీకి యంత్రాగారానికి ముడిసరుకు అవసరంకాగా తాటిచెట్లు సిద్ధమయిన వస్తువులను, వస్తువుల తయారీకవసరమైన ముడి సరుకునుకూడా తామే యిస్తాయి. అంటే యివి మానవాళికి అనేకవిధాల తోడ్పడతాయి. ఆవిధాలను దిగువవిధంగా విభజించవచ్చు.

1. వ్యవసాయం : వ్యవసాయానికి తాటిచెట్లు ప్రత్యక్షంగా వుపకరించవు కాని పరోక్షంగా మిక్కిలి వుపయోగకరమయినవి. వీటిలో కొన్నిభాగాలు వంటచెఱకుకు వుపకరిస్తాయి. కాబట్టి ఆమేరకి రైతులు యిప్పటిలా పశుగెత్తం లేక ఆవుపేడను పొయిలోపెట్టి వృథాచేయ నవసరం వుండదు. ఆవిధంగా మిగిలిన ఆవుపేడను పెంట యెరువు గుంటలలో వేసి పెంటయెరువు విలువను అనేకరెట్లు హెచ్చించుకోవచ్చు. అది పొలాల సారాన్ని బాగా వృద్ధిచేస్తుంది. అప్పుడు పంటలు విరగపండుతాయి.

రెండవది, యీచెట్ల మానునుదొలిచి రెండు విధాల వుపయోగించుకోవచ్చు. ఇవి పక్కాకాలువలు, గొట్టాలు (హ్యూం పంపుల వంటివి) గా వుపయోగపడతాయి. అనగా వీటితో తోటలకి, మాగాణీ పైర్లకికూడా నీటిపారుదలకి కాలువలు, ప్రక్కకాలువలను యేర్పాటు చేయవచ్చు. వాటితో యేతాములుచేసి నీటిని తోడవచ్చుకూడా.

మూడవది, వీటి మానులతో పంటకాలువలకి చవకగా చిన్నరకం వంతెనలను కట్టవచ్చు. ఆ కాలవలపై వీటిని కాలినడక వంతెనలుగా కూడా వేయవచ్చు. ఈ విధంగా రైతుల రాకపోకలకి సౌకర్యాలు కల్పించవచ్చు

నాలుగవది, తాటిచెట్లను పొలాలు, తోటల సరిహద్దులలోనాటి పంటలు పశువులపాలు కాకుండా కాపాడవచ్చు. ఇందువల్ల పొలాల సరిహద్దుల విషయంలో వచ్చే వివాదాలకికూడా ఆస్కారముండదు. ఆవిధంగా రైతులకు యెంతో మనోవైకల్యం తప్పుతుంది.

2. ఆహారం : తాటిచెట్లు రైతులు పొలాలు బాగుచేసుకుని వుత్పత్తిని హెచ్చించు కొనుటకు తోడ్పడుటే కాక పనులులేని కాలంలో గ్రామంలోని పేదవారికి నేరుగా వుచితంగా ఆహారాన్ని కూడా సమకూరుస్తాయి,

i. తాటికాయల్ని కొట్టి ముంజలు తీసుకొని తింటారు. ఇవి ముఖ్యంగా వేసవిలో దేహానికెంతో చలువ, బలముకూడాను. ముంజలుకొట్టగా వచ్చే చెక్కు పాడియావులకి, గేదెలకి చక్కని ఆహారం.

ii. తాటిపళ్లుకూడ చక్కని ఆహారం. ఉచితంగా లభించే యీపళ్లను గ్రామాలలో పేదవారు తింటారు. తాటిపేశాన్నితీసి చాపలు మున్నగు వాటిపై తాండ్రపూసి యెండబెట్టుకు తింటారు.

iii. రసంతీసిన తాటిటెంకల్ని పాతిపెడితే తేగలు వూరతాయి. ఇవి మొక్కలేతవేరులన్నమాట. అడుగునుంచి అడుగున్నరవరకూ పెరిగే యీ తేగల్ని కాల్చుకుని లేక వుడక పెట్టుకుని తింటారు. ఇవికూడ బలమయిన అహారమే.

iv. తాటిచెట్లు యిచ్చే ఆహారపదార్థాలలో నీరా అతి ముఖ్యమైనది. ఈపానీయం కొంతవరకూ ఆరోగ్యకరమయినది. దీనిని సేవిస్తే చలువచేస్తుంది. దీనిని పులియబెట్టి కల్లుచేస్తారు.

ఈ ద్రవపదార్థంనుంచే బెల్లం, కలకండకూడా తయారు చేయబడతాయి.

v. తాటి ముంజకూడా రుచిగా వుంటుంది. దీనిని తింటారు. ఇది చెట్లుకొట్టినప్పుడు లభిస్తుంది. తేగలువూరగా మిగిలిన టెంకలు (బుర్రలు) కొడితే వాటిలోకూడా గుంజు వుంటుంది. ఈ బుర్రగుంజు నుకూడా తింటారు. ముంజలాగే యిదికూడా రుచికరమయినదే. ఈరెండుకూడా దేహానికి పుష్టి నిస్తాయి.

తాటిచెట్టు యిచ్చే ఆహారం విలువ యెట్టిదో, ఆబుతువులో దానిపై యెందరు పేదప్రజలు జీవిస్తారో తెలుసుకొనుటకు పైవిషయాలు చాలు.

3. గృహవసతి : పైవ్యవసాయ, ఆహారప్రయోజనాలకే కాక తాటిచెట్లు యిళ్లు కట్టుకొనుటకు కూడా వుపకరిస్తాయి. ఈ యిళ్లు వేసవిలో చల్లగాను, శీతాకాలంలో వెచ్చగాను వుంటాయి.

తాటిమానులు గుంజలు, దూలాలు మున్నగు వాటికి వుపకరిస్తాయి. గ్రామాలలో నిర్మించుకునే యిళ్ళకి ఒక్కొక్కదానికి 6,8 చెట్లు కావాలి. అట్టియింట్లో సాధారణమయిన కుటుంబం వుండ వచ్చు. మానును పలకలుగా కోస్తే తలుపులు, ద్వారబంధాలకు పనికివస్తుంది.

ఆకులతో పైకప్పును వేస్తారు. ఈకప్పు 2-5 సంవత్సరాలు గట్టిగా వుంటుంది.

గ్రామీణుడు గోడ కట్టుకోగలిగితే అది పక్కా యిల్లే. లేకపోతే పక్కల రాటలుపాతి ఆకులతో దడి కట్టుకోవచ్చు

## కుటీర పరిశ్రమలు

అన్నం, యిల్లు వున్నాక యెవరికయినా కాస్త సుఖంగా సంతోషంగా బ్రతకాలనిపిస్తుంది. అందుకు కాస్త అదనంగా డబ్బు సంపాదించాలి. ఉపవృత్తులకు అవకాశం కల్పించి యీ సందర్భంలోకూడా తాటిచెట్లు గ్రామీణులకి తోడ్పడతాయి, ఉపయోగకరమయిన, ఆర్థికప్రయోజనంకల వాటి వస్తువుల శక్తి అట్టిది.

తాటి మట్టలనుంచి తీసే నారతో తాళ్లు అల్లవచ్చు. అది వ్యవసాయంలోను, మరికొన్ని ప్రయోజనాలకి కూడా పనికి వస్తుంది. అదే కమ్మచేలి కర్రగా కూడా వుపకరిస్తుంది. ఈ తాటి మట్టలనుంచి లభించే మరొక పదార్థంతో చుట్ట కుదుళ్లు చేయవచ్చు. అలాగే చీపుళ్లను కూడా.

మానునుంచి మంచాలు, దీపం స్టాండులు, చిన్న ర్యాక్‌లు, మోట కుర్చీలు, నేత పిన్నులు, చిన్న బోట్లు మున్నగు వాటిని తయారు చేయవచ్చు.

ఆకులతో యిళ్లువేయుట దడులు కట్టుటయే కాక దిగువ వస్తువులను కూడా తయారు చేస్తున్నారు. రైతులకి వుపకరించే గట్టి గొడుగులు, వివిధ పరిమాణాల తట్టలు, చవకయిన విసనకర్రలు, అందమయిన చేతిసంచీలు, విస్తారం వాడబడే చాపలు.

ఇవే కాక ఆకులతో ఆటవస్తువులు, బొమ్మలు, గృహాలంకరణ సామగ్రి కూడా ముఖ్యంగా గ్రామస్త్రీలచే తయారు చేయబడతాయి. ఈ విధంగా యీ చెట్లు సామాన్య మానవునికి పని కల్పించి వుపయోగకరమయిన వస్తువులను, అదనపు రాబడిని లభింప చేస్తాయి.

## సాధారణ ప్రయోజనం

మొత్తంమీద తాటిచెట్లు తుదనుంచి మొదలు వరకూ వేళ్లు, మాను, ఆకులు, మట్టలు అన్నీకూడా

యెందుకో అందుకు వుపయోగిస్తాయి. అలాగే సిద్ధమయిన వస్తువులు, సిద్ధంకాని వస్తువులు, కొత్తవి, పాతవి, మంచివి, చెడిపోయినవి అన్నికూడా ఆఖరి అణువు వరకూ వుపయోగిస్తాయి. ఇంకా ఆశ్చర్యమేమిటంటే దానిని కాలిస్తే బూడిదకూడా వుపయోగిస్తుంది. తాటి చెట్టునుంచి వచ్చిన ప్రతి చిన్న వస్తువు మానవాళి వుత్తమోత్తమ ప్రయోజనానికై వుపయోగపడుతున్నదనడం విదితమవుతుంది. యిందువల్ల ఆ చెట్టును పూర్తిగా వుపయోగించుకున్న తరువాత యేదో ఒక రూపంలో దానితో వంటచెఱకు కాకపోతే పెంటయెరువు తయారు చేయబడుతుంది. ఈ విధంగా యీ చెట్టు వంటచెఱకు సమస్యను పరిష్కరించి తద్వారా లక్షలాది టన్నుల అవుపేడను మిగిల్చి పెంట యెరువు తయారీకి అవకాశమిస్తున్నది. మరోలా చెప్పాలంటే తాటి చెట్లు పొగరాని పొయ్యిలలో వంటకు ప్రోత్సాహమిస్తాయి.

ఒక్క మాటలో చెప్పాలంటే, వీటికి అవసరంలో నున్న ప్రజానీకానికి తోడ్పడే శక్తి సామర్థ్యాలు వున్నవని మినహాయింపులు లేకుండా అంగీకరించ బడాలి. మన అరిచేయి ముఖ్యమయిన వుపయోగ కరమయిన పనులన్నిటిని చేస్తుంది కాని దేహంలోని యితర అవయవాలకు మల్లేదానికి మనం సంరక్షణ మాత్రం చేయం. తాటిచెట్లు మన అరచేయి వంటిది.

ఇవి వర్షం లేకపోయినా చక్కగా పెరుగుతాయి వ్యాధిని నిరోధించ గలవు. వీటిని భారతదేశం అన్ని ప్రాంతాలలోను ప్రవేశ పెట్టుటకు వ్యవధి తీసుకుంటుంది. వాటి సత్ఫలితాలు ప్రజలకు అందుబాటు కావడానికి యింకా వ్యవధి తీసుకుంటుంది. అయితే యీ విషయాన్ని సానుభూతితో పరిశీలించి, పంచవర్ష ప్రణాళికల అమలులో దానిని ప్రత్యేకాంశంగా చేర్చడం అవసరం. అభివృద్ధి కేంద్రాలన్నిటికి యీ విత్తనాలను సరఫరా చేసి వచ్చే వనమహోత్సవంలో వాటిని నాటుటకు ప్రత్యేక ప్రాధాన్యాన్ని యివ్వాలి.



# కడప

కడప రాయలసీమ జిల్లాల్లో ఒకటి. దానికి వుత్తరాన కర్నూలు, దక్షిణాన చిత్తూరు, తూర్పున నెల్లూరు, పశ్చిమాన అనంతపురం వున్నాయి. దాని విస్తీర్ణం 5,929 చ. మైళ్లు. జనాభా 11.62 లక్షలు (1951 జనాభా లెక్కల ప్రకారం 10.28 లక్షలు గ్రామీణులు, 1.34 లక్షలు పట్నవాసులు). ఈ జిల్లాలో 984 గ్రామాలున్నాయి. పురుషుల సంఖ్య 5,95,060. స్త్రీల సంఖ్య 5,66,671 మొత్తం జనాభాలో పట్నవాసుల శాతం 11.6. ఈ జిల్లా మొత్తం జనాభా 12 లక్షలలోను 7,52,795 మంది వ్యవసాయంపైనా, 1,20,609 మంది వ్యవసాయేతర వృత్తిపైనా, 56,167 మంది వాణిజ్యంపైనా, 11,613 మంది రవాణాపైనా, 2,20,547 మంది యితర వృత్తులపైనా జీవిస్తారు. మొత్తం జనాభాలో అక్షరాస్యుల శాతం 15.5. 32,000 మంది స్త్రీలు, 1,48,000 పురుషులు అక్షరాస్యులు. ఈ జిల్లాలో మొత్తం 2,37,000 కుటుంబాలున్నాయి.

ఈ జిల్లాలో స్వతంత్ర మయిన ఒక సబ్-తాలూకాతో సహా 9 తాలూకాలున్నాయి. అవి యివి: కడప, ప్రొద్దుటూరు, రాజంపేట, జమ్మలమడుగు, పులివెందల, బద్వేలు, రాయచోటి, సిద్ధవటం, కమలాపురం.

ఈ జిల్లాలో పెక్కు కొండలు, వాగులు, దట్టమయిన అరణ్యాలు, లోయలు వున్నాయి.

## నదులు

పెన్నారు పడమరనుంచి తూర్పుకి ప్రవహించి తూర్పు కనుమలలో సోమశిల వద్దగల మార్గం ద్వారా నెల్లూరు జిల్లాలో ప్రవేశిస్తుంది. దీని ముఖ్యమయిన వుపనదులు, కుందు, సగిలేరులు. ఇవి వరుసగా ప్రొద్దుటూరు గుండాను, బద్వేలు, సిద్ధవటం తాలూకాల గుండాను ప్రవహిస్తాయి. పీఠభూమి నుంచి ఈ జిల్లాలోకి మూడు ముఖ్యమయిన ప్రవాహాలు వస్తాయి. అవి యివి: చిత్రావతి, పాపాఘ్ని, చెయ్యేరు. చివరి రెండు రాయచోటి తాలూకా గుండా ప్రవహిస్తాయి.

## భూమిరకాలు

ఈ జిల్లా నేలలు ముఖ్యంగా రెండురకాలు. 1. రేగడ, 2. ఫెర్రూజినసు. జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, పులివెందల, కమలాపురం, కడపలు నల్లరేగడ ప్రాంతాలు. జిల్లా నైఋతి దిశనున్న రాయచోటి తాలూకా పీఠభూమి. జిల్లా తూర్పున గల బద్వేలు, సిద్ధవటం, రాజంపేటలు కొండలచే చుట్టబడిన లోయలో వున్నాయి.

## శీతోష్ణస్థితి

ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్, మే నెలల్లో యెండలు భరించ శక్యంగాకుండా వుంటాయి. అయితే యీ జిల్లా యెత్తులో వున్నందున, దాదాపు దాని అన్ని భాగాలలోను సంవత్సరంలో చాలకాలం చల్లగానే వుంటుంది. సగటు వర్షపాతం 27.14 అం.

## ఖనిజాలు

ఈ జిల్లాలో ముఖ్యమైన పెద్దరకం ఖనిజాలు ఆస్బెస్టాస్, బారైట్స్, ముడియినుం, చైనాబంక. చిన్నరకం ఖనిజాలు కడపరాళ్లు.

## అడవులు

అడవుల విస్తీర్ణం 1815 చ.మైళ్లు. ఈ అడవులు ముఖ్యమైన కొండలపై అనగా వెలిగొండ, శేషా

చలం, పాలకొండ, లంకమాని, నల్లమల కొండలపై వున్నాయి. గొప్ప తరగతికి చెందిన సతత హరిద చిట్టడవులు, ఆకులురాల్చే అడవులు కూడా యిక్కడ వున్నాయి. కొన్ని అడవులలో విలువయిన కలప వున్నది.

## పేరుమూలం

ఒంటిమిట్ట లోయగుండా పుణ్యస్థలమయిన తిరుపతి కొండకి వెళ్లేమార్గం గడపలా వున్నందున దాని కాపేరు వచ్చిందని సాధారణంగా భావించబడుతుంది. కడప "గడప" భ్రష్టరూపం కావచ్చు. మరొకవాదం ప్రకారం కడప నామం సంస్కృత శబ్దమయిన కృప నుంచి యేర్పడి వుండవచ్చు. ప్రాచీన పత్రాలలో 18వ. శతాబ్దంవరకూ యీ ప్రదేశంపేరు "కృప" లేక "కూర్పా"అని వ్రాయబడేది.

## చరిత్ర

ప్రస్తుత కడప పట్నం 16వ. శతాబ్దం వుత్తరార్థంలో నిర్మించ బడిందని విశ్వసించ బడుతున్నది. విజయ నగర పరిపాలన కడప, నెల్లూరు జిల్లాలకి విస్తరించినదనే విషయం అంగీకరించ బడింది. ఎందువల్లనంటే, జమ్మలమడుగు తాలూకా గండికోట, సిద్ధవటం తాలూకా ఒంటి మిట్టలలోని ప్రాచీన దేవాలయాలకు అస్తుల నిచ్చిన బుక్కరాయల పేరు శిలా శాసనాలలో పేర్కొనబడింది. 1799 లో శ్రీ రంగపట్నం పతనం చెందిన పిమ్మట నైజాం కడప జిల్లాను బ్రిటిషు వారికి చెల్లించవలసిన బకాయి నిమిత్తం వారికి బదలీ చేయబడింది. దానిని యిచ్చివేస్తున్న ఒప్పందంపై హైదరాబాదులో 1800 అక్టోబరు 12వ. తేదీన సంతకాలు జరిగాయి.

## వ్యవసాయం

వరి, జొన్న, సజ్జ, రాగి, కొర్ర, వరగు ముఖ్యమైన ఆహార పంటలు. వేరుసెనగ, ప్రత్తి ముఖ్యమయిన వాణిజ్య పంటలు.

ఈ జిల్లాలో ప్రధానమయిన పంటకాలవ కర్నూలు - కడప కాలవ. ఇది కర్నూలు పట్నానికి 17 మైళ్ల యెగువ తుంగభద్రపై నిర్మించబడిన ఆనకట్టనుంచి ప్రారంభమవుతుంది. దాని పొడవు 190 మైళ్లు. అది 137వ. మైలులో జమ్మలమడుగు తాలూకా ఈశాన్య దిశను యీ జిల్లాలో ప్రవేశించి, ప్రొద్దుటూరు, కడప తాలూకాలగుండా ప్రవహించి పాతకడప చెరువులో కలుస్తుంది.

| | |
|---|---|
| కడప జిల్లాలో నీటి పారుదలక్రింద గల భూమి విస్తీర్ణం | 43,353 |
| కడప, కర్నూలు జిల్లాల్లో నీటి పారుదల క్రిందగల భూమి విస్తీర్ణం | 1,23,419 |
| క. క. కాలువప్రాజెక్టు ద్వారా నీటి పారుదలలభింప చేయాలని తలపెట్టిన అదనపుభూమి విస్తీర్ణం | 3,00,600 |

దిగువ సగిలేరు, పించా ప్రాజెక్టులు 6,880 యెకరాలకి నీటిని అందిస్తాయి. క. క. కాలువ క్రింద అయకట్టు స్థిరీకరణ పని పూర్తి అయింది. ఇతర నీటి పారుదల వనరులు నదీ కాలువలు, వర్షాధారమయిన చెరువులు, బావులు అయి వున్నాయి.

## పరిశ్రమలు

జమ్మలమడుగు, ప్రొద్దుటూరు తాలూకాలలో ప్రత్తిగిన్నింగు, వేరుసెనగ తొక్కవొలుపు, నూనె మిల్లులు వున్నాయి. ఇంతకి మించి యీ జిల్లాలో భారీ పరిశ్రమ లేమీలేవు. జమ్మలమడుగు సమాజాభివృద్ధి కేంద్రంలో వడ్రంగం కేంద్రం, దర్జీపని కేంద్రం నడుస్తున్నాయి. ముద్దనూరులో కమ్మరం కేంద్రం వుంది.

## సమాజాభివృద్ధి

ఈ జిల్లాలో 2 వ అంచె కేంద్రాలు 4 : జమ్మలమడుగు, చెన్నూరు, మైదుకూరు, ముద్దనూరు. జా. వి. సే. కేంద్రాలు యివి : 1. పోరుమామిళ్ల, 2. బద్వేలు, 3. కోడూరు, 4. బలపనూరు, 5 ఎర్రగుంట్ల, 6. భద్రాపేట, 7. కోనంపేట, చిన్నమాండెం.

## పశుపోషణ

పశుపోషణశాఖ ఒక ఆస్పత్రిని, 8 ఔషధశాలలను, 2 సంచార చికిత్సాలయాలను నడుపుతున్నది.

జిల్లాలో 726 సహకార సంఘాలున్నాయి. మొత్తం సభ్యుల సంఖ్య 42,971. వాటా మూల ధనం రూ. 10,05,146.

1956-57 లో జిల్లాలో స్థానికాభివృద్ధి పనులపై రూ. 2,73,132 ఖర్చు చేయబడినవి. 1957-58 లో చిన్న మొత్తాల పొదుపులో యీ జిల్లా రూ.21,04,745 లను సేకరించింది (26-1-58 నాటికి).

కడపలో జిల్లా ముఖ్యపట్నం. ఆస్పత్రికి మంజూరయిన పడకల సంఖ్య 140. ఇదికాక యీ జిల్లాలో మరో 5 ప్రభుత్వ ఆస్పత్రులున్నాయి. వాటి మొత్తం పడకల సంఖ్య 65.

కడప, ప్రొద్దుటూరులలో మాత్రం కుళాయిల ద్వారా రక్షిత నీటి సరఫరా చేయబడుతుంది. పెన్నారు నది గర్భంలో త్రవ్వబడిన బావులనుంచి నీరు జలాశయాలలోనికి తోడబడి సరఫరా చేయబడుతుంది.

## జిల్లా పా. స., శా. స. స., శా. మం. స.

### పార్లమెంటు సభ్యులు

1 శ్రీ వి. రామిరెడ్డి, కడప (కడప నియోజకవర్గం).

2 శ్రీ టి. ఎన్. విశ్వనాధరెడ్డి, మదనపల్లి (రాజంపేట నియోజకవర్గం).

### శాసనసభ సభ్యులు

1 శ్రీ మహమ్మద్ రహంతుల్లా, కడప (కడప నియోజకవర్గం).

2 శ్రీ కె. కోటిరెడ్డి, కడప (లక్కిరెడ్డిపల్లి నియోజకవర్గం).

3 శ్రీ బి. రామరెడ్డి, బద్వేలు (మైదుకూరు నియోజకవర్గం.

4 శ్రీ కె. రామయ్య, జమ్మలమడుగు (జమ్మలమడుగు నియోజకవర్గం).

5 శ్రీ వై. ఆదినారాయణరెడ్డి, ఇసందుపల్లి (రాయచోటి నియోజకవర్గం).

6 శ్రీ బి. రత్న సభాపతి, ఎల్లంపేట (బద్వేలు నియోజకవర్గం).

7 శ్రీ పి. పార్థసారథి, కోడూరు (రాజంపేట నియోజకర్గం)

8 శ్రీ పి. వెంకటసుబ్బయ్య, రిజర్వుడు, కడప (రాజంపేట నియోజకవర్గ).

9 శ్రీ చంద్రా ఓబులరెడ్డి, ప్రొద్దుటూరు (ప్రొద్దుటూరు నియోజకవర్గం).

10 శ్రీ ఎన్. సంభారెడ్డి, వీరపురాయునిపల్లి (కమలాపురం నియోజకవర్గ).

11 శ్రీ పి. బాసిరెడ్డి, కడప (పులివెందుల నియోజకవర్గం).

### శాసన మండలి సభ్యులు

1 శ్రీమతి కె. రామసుబ్బమ్మ.

2 శ్రీ రాజు సుబ్బారెడ్డి.

3 శ్రీ నారాయణరెడ్డి.

4 శ్రీ సీతారామయ్య.

### దర్శనీయమయిన స్థలాలు

కడప : జిల్లా ముఖ్యపట్నం. ఇక్కడ రద్దీగా వ్యాపారం జరుగుతూవుంటుంది. ఇది బొంబాయి ప్రధాన మార్గంలో వుండుటవల్ల పుచ్చకాయలు, పసుపు, రాళ్లు, వుల్లిపాయలు మున్నగువాటిని యెగుమతి చేయుటకు సౌకర్యంగా వుంటుంది. కడపకి 1-1/2 మైళ్ళ వుత్తరాన పాతకడపవుంది. అక్కడ సుప్రసిద్ధమయిన శ్రీ వెంకటేశ్వరాలయం వున్నది. అది విజయనగర సామ్రాజ్యంనాటిది.

చెన్నూరు : ఇది కడపకు వాయవ్యాన 7 మైళ్ళ దూరంలో పెన్నారు కుడిగట్టున వుంది. చెన్నూరు పుచ్చకాయలకు, తమలపాకులకు ప్రసిద్ధి. ఇక్కడి నుంచి రోజు రూ. 30,000 విలువగల తమలపాకులు యెగుమతి అవుతాయి.

ఈ గ్రామంలోగల ఒక శిలా శాసనాన్నిబట్టి యిది యెంత పురాతనమైనదో తెలుసుకోవచ్చు: ఈ ప్రాంతం కృష్ణదేవరాయల పరిపాలనలో నున్నప్పుడు యిది ఒక పరిపాలనా కేంద్రం ముఖ్య పట్నంగా వుండేదట.

గండికోట : జమ్మలమడుగుకి పశ్చిమాన యించుమించు 5 మైళ్ళ దూరంలో కొండపై వుంది. ఈ పేరు గండి, కోట అనే రెండు పదాలవల్ల యేర్పడింది.

కోటలో పెక్కు బావులు 'రాయలచెరువు' అనే చెరువు వున్నాయి. వీటిలో యెప్పుడూ నీరు వూరుతూవుంటుంది. ఇవి చుట్టుపట్ల తోటలను పోషిస్తాయి.

కోడూరు : గంజన నదిపై గంజన రైలుస్టేషను నుంచి ఒక మైలు ఈశాన్యంగా వుంది. ఇది వెదురు మంచాలు, బుట్టలు మున్నగువాటి తయారీకి ప్రసిద్ధి.

అటవీశాఖ ఒక వంటచెఱకు డిపోను, పెద్ద మామిడితోటను నిర్వసిస్తున్నది.

కోడూరులో చాలకాలంక్రితం జర్మన్ లూథరిన్ మిషన్‌శాఖ ఒకటి నెలకొల్పబడింది. కోడూరు మిషన్ చర్చి 1887 లో నిర్మించబడింది. కోడూరుకి ఆగ్నేయంగా 1-1/2 మైళ్ళ దూరంలోనున్న కృపాపల్లిలో యీ మిషన్ ఒక కుష్టు రక్షణ సదనాన్ని నడుపుతున్నది.

ఇక్కడ ప్రభుత్వ ఫలాల నిలవకేంద్రం వుంది.

జమ్మలమడుగు : ముద్దనూరు రైలుస్టేషనుకి 12 మైళ్ళ దూరంలో పెన్నారు వుత్తరతీరాన వుంది.

ఇక్కడ ప్రధానంగా ప్రత్తివ్యాపారం జరుగుతుంది. ఇక్కడ తలపాగాలు, టేబులుగుడ్డలు, తెరలు వుత్పత్తి చేయబడతాయి.

శ్రీ వెంకటేశ్వరస్వామి ఆలయం పట్నానికి ఆగ్నేయంగా 1-1/2 మైళ్ళ దూరంలో వుంది. ఇది మిక్కిలి పెద్ద ఆలయం.

ప్రొద్దుటూరు : ఎర్రగుంట్ల రైలుస్టేషనుకి 8 మైళ్ల దూరంలో పెన్నారు వుత్తరతీరాన వుంది.

ఇది రాయలసీమలో కెల్లా కాకపోతే జిల్లాలో కెల్లా మిక్కిలి సంపన్నమయినపట్నం. ఇక్కడ యెక్కువ వ్యాపారం ప్రత్తి, నీలిమందు, ఆహార ధాన్యాలలో జరుగుతుంది.

పులివెందల : కదిరి-ముద్దనూరు రోడ్డుమీద వుంది. శతాబ్దాలకి పూర్వం యిక్కడ పెద్దపులులు ఆవాస మేర్పరుచుకున్నందున పులులుస్థానం పులివేంద్ల అని పేరు వచ్చింది. ఇక్కడ తమలపాకులు, పళ్లు పెరుగుతాయి. గురువారాలు జరిగే సంత యీ జిల్లా సంత లన్నిటికంటె మిక్కిలి పెద్దది.

పుల్లంపేట : రాజంపేటకి ఆగ్నేయంగా 7 మైళ్ల దూరాన, రెడ్డిపల్లి రైలుస్టేషనుకి 3 మైళ్ల దూరాన వుంది. దీనికి దగ్గరలో పుల్లంగినది ప్రవహిస్తుంది.

ఇక్కడి చేనేతవారి నైపుణ్యం సుప్రసిద్ధమయినది. వారు వెండి, బంగారు ఎంబ్రాయిడరీ తయారీలో ప్రత్యేక నైపుణ్యం గడిస్తారు. పుల్లంపేట చీరలు, ధోవతులు మిక్కిలి ప్రసిద్ధమైనవి. ఇక్కడ ఆంజనేయ స్వామి ఆలయం, శివాలయం వున్నాయి.

రాజంపేట : పట్నం రైలుస్టేషనునుంచి ఒక మైలు దూరంలోవుంది. అది పుల్లంగి యెడమగట్టున వుంది. పుల్లంగి నాలుగు మైళ్ళు అవతల వుత్తరాన గల చెయ్యేరులో కలుస్తుంది.

రాజంపేట పళ్ళతోటలు ప్రసిద్ధమైనవి. అది వ్యాపారకేంద్రం.

ప్రతి బుధవారము పెద్ద సంత జరుగుతుంది. ప్రజలలో పెక్కుమంది వృత్తినేత :

ఒంటిమిట్ట : కడప ప్రధాన రోడ్డుమీదగల సిద్ధవటానికి ఆగ్నేయంగా 8 మైళ్ళ దూరంలోవుంది. సిద్ధవటం తాలూకా చెరువులలో ఒంటిమిట్ట చెరువు మిక్కిలి పెద్దది. దానికి అద్భుతమైన అరగాణి, 1000 మించిన ఆయకట్టు వున్నాయి. ఇక్కడగల కోదండరామస్వామి ఆలయం ప్రసిద్ధమయినది. ఏటా ఏప్రిల్‌లో 9 రోజులపాటు వుత్సవాలు జరుగుతాయి. రాయచోటి, సిద్ధవటం, వేంపల్లిలు యీ జిల్లాలో ముఖ్యమైన యితర ప్రదేశాలు.

గ్రామాలలో

# గోమయంతో వాయువు తయారీ

మనదేశంలో రైతులవద్ద వుండే గోమయంలో సగానికిపైగా వంట ప్రయోజనాలకై వాడివేయబడుతున్నది. ఎంతో విలువయిన యెరువులో అధిక భాగాన్ని యిలా వృధాచేయుట వాంఛనీయం కాదని గుర్తించబడింది. కాని గ్రామాలలో వంట చెఱకు సమస్యకు మరో పరిష్కారంలేక దీనిని యెరువు ప్రయోజనాలకై మళ్లించుట సాధ్యపడలేదు. దేశంలో ఉష్ణశక్తి అవసరాలలో మూడు వంతులు పశువుల పేడను కాల్చుటద్వారా లభిస్తున్నదని కేంద్ర ప్రభుత్వ అణుశక్తిశాఖ కార్యదర్శి డా. హెచ్. జె. భాభా పేర్కొన్నారు. నిజానికిది ఆశ్చర్యకరమయిన విషయం. ఈ సమస్యకిప్పుడు యింకా ప్రాముఖ్యమేర్పడింది. ఎందువల్లనంటే, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పంటల ఉత్పత్తిని హెచ్చించ సంకల్పించబడింది. ఇందునిమిత్తం దేశంలో లభ్యమయ్యే యెరువుల్ని పూర్తిగా వినియోగించుకోవాలని కూడా సంకల్పించబడింది.

న్యూఢిల్లీలోని భారతీయ వ్యవసాయ పరిశోధక సంస్థ యించుమించు 17 సంవత్సరాల క్రితం యీ సమస్య పరిశోధనను చేపట్టింది. పరస్పర విరుద్ధాలయిన యీ రెండు అంశాలను-వంట చెరకుగాను, పంటలకి యెరువుగాను కూడా పేడనువాడుట సమన్వయపరచుట కనువయిన పద్ధతిని కనిపెట్టాలనే ఆశయంతో అది ఆ పరిశోధనను చేపట్టింది. ప్రయోగాలు 1954 లో పూర్తి అయినవి; వాటి ఫలితంగా సరళంగా పనిచేసే చవకరకం యంత్రాంగమొకటి కనిపెట్టబడింది. దీని సహాయంతో పేడమొదట కుళ్లబెట్టబడి, వంట ప్రయోజనాలకై ఇంధనంగా వుపయోగించే వాయువు తగినంత తయారుచేయబడుతుంది. ఆ తరువాత మిగిలిన పేడలో యెరువు సంబంధమయిన లక్షణాలన్నీ వుంటాయి. కాబట్టి దానిని యెరువుగా వాడుకోవచ్చు. ఈ వాయు యంత్రం ప్రత్యేకం గ్రామీణ పరిస్థితులకు తగినట్లు తయారుచేయబడింది. అది యెలా పనిచేస్తుందో చూచుటకై ఢిల్లీచుట్టూగల 12 గ్రామాలలో రైతుల యిళ్లలో నెలకొల్పబడింది. అవన్నీ కూడా రెండు సంవత్సరాలనుంచి విడువకుండా చక్కగా పనిచేస్తున్నాయి. ఇందువల్ల రైతులకు చక్కని సమర్థమయిన వంట చెరకూ లభిస్తున్నది; మిగిలిన పేడను పొలాలకు యెరువుగా వాడుకొని వారు పంటలనూ హెచ్చించుకొంటున్నారు. ఈ వాయు యంత్రం యిటీవల కర్షకుల ఫోరమ్ వార్షిక సమావేశంలో విజయవంతంగా ప్రదర్శింపబడింది. దేశం వివిధ ప్రాంతాలనుంచి వచ్చిన రైతులకు చూపించబడింది. ఇప్పుడు రైతులందరూ దేశవ్యాప్తంగా దీనిని వుపయోగించాలని సిఫార్సు చేసే సమయం వచ్చింది.

ఈ గ్రామీణ రకం వాయు యంత్రాన్ని నెలకొల్పుటకు యించుమించు రూ. 350/- ఖర్చు అవుతుంది. ఇది 5 మందిగల కుటుంబానికి సరిపోతుంది. దైనందిననిర్వహణకై ఖర్చు యేమీ అవసరంలేదు. క్రమబద్ధంగా 4 పశువుల పేడను వేస్తే రోజూ యించుమించు 100 ఘ. అ. వాయువు లభిస్తుంది. ఈ వాయువును వంటకి, దీపాలకి కూడా వాడవచ్చు. ఈ వాయువు నీలం మంటవేడిగా వుంటుంది. పొగ రాదుకూడా. ఇందువల్ల వంట ఒబ్బిడిగా త్వరగా అవుతుంది.

ఈ మార్పులో పేడలో వుండే యెరువు గుణం నశించదు. సరికదా వాయురూపంలో ఉష్ణశక్తిమాత్రమే తీసివేయుటవల్ల మిగిలినపేడ అసలుపేడ

కంటే మంచి యెరువుగా తయారవుతుంది. ఈ సంస్థలో జరుపబడిన పంటల ప్రయోగాలలో యీ విషయం ఋజువయింది.

ఈ తయారీ యేదశలోనూకూడా పేడకి పురుగు పట్టదు. పేడను యెండబెట్టే దశలో దానిపై వుంచి, పురుగులు బ్రతకలేదని కనుగొనబడినది.

ఈ వాయు యంత్రాన్ని నెలకొల్పుకుంటే దేశ మంతటా కూడా రైతులు ధూసారాన్నితద్వారా పంట వుత్పత్తిని హెచ్చించుకోవచ్చు. అంతేకాక గ్రామాలలో చిక్కు సమస్యగావున్న వంట చెరకు సమస్య కూడా తీరిపోతుంది.

## సూత్రం

పేడలేక సేంద్రియ, పదార్థమేదైనాగాలి లేకుండా కుళ్ళితే ఇంధన లక్షణంగల 'మెథానే' అనే వాయువు వుత్పత్తి అవుతుంది. ఈ వాయు యంత్రం యీ సాధారణ సూత్రంపై ఆధారపడి పని చేస్తుంది. గ్రామీణ రకం వాయు యంత్రంలో పేడ కుళ్ళే ప్రదేశం 12 అడుగుల లోతు, 6 అడుగుల వ్యాసంగల బావి. దానిపైభాగం యిటుకలతో కట్టబడుతుంది. గోమయాన్ని నీళ్లలో కలిపి ఆ ద్రవాన్ని దీనిలో పోస్తారు. తరువాత దీనిపై 5 అ. వ్యాసం, 4 అ. యెత్తుగల ఇనుపపీపాబావిలో బోర్లించబడుతుంది. ఇందువల్ల లోపలికి గాలిచొరదు; తద్వారా పేడ కుళ్లుటకు అవకాశమేర్పడుతుంది. ఉత్పత్తి అయిన వాయువు బోర్లించిన పీపాలో బుడగలు తేరుతుంది. అప్పుడది తేలిపైకి రానారంభిస్తుంది. పీపాపైనగల మొననుంచి గొట్టాలద్వారా వాయువును వంటింట్లోకి తీసుకువెళ్లి వంట చేసుకోవచ్చు.

ఆగకుండా రోజూ వాయువు వుత్పత్తి కావాలంటే యించుయించు 100 పౌనుల పేడను నీళ్లలో కలిపి గళ్లాగొట్టంద్వారా బావి అడుగుకి పంపాలి. పాతద్రవం బావిపైనుంచి పొర్లి ఒక గుంటలో చేరుకుంటుంది. దానిని అప్పుడప్పుడు తీసి యెరువుగా వాడుకోవచ్చు.

## స్థాపన

మొదట 7 అ. వ్యాసంగల గుండ్రని గుంట 4 అ. లోతుకి త్రవ్వబడుతుంది. ఆ తరువాత గుంటచుట్టూ 9 అం. స్థలం ఒదిలిపెట్టి 5-5 అ. వ్యాసంలో అదిమరి 8 అ. లోతు త్రవ్వబడుతుంది. అప్పుడు బావి అడుగు భాగం యిటుకలతో కట్టబడుతుంది. లేదా సెమెంటుచేయబడుతుంది. బావి గోడలు అడుగునుంచి 6 అ. యెత్తువరకు యిటుకతో కట్టబడతాయి. బావిలో యీ ప్రదేశంవద్ద 8 అం. వెడల్పుగలిగి, బావినుంచి 3 అ. దూరంలో పైకివచ్చే యేటవాలు కాలువ ఒకటి ఒక పక్కని త్రవ్వబడుతుంది. పేడ ద్రవాన్ని పంపే గొట్టాన్ని యీ కాలువలో పాతి ఒక కొనసరిగ్గా బావిలోనికి వెళ్లేట్టు మరొకటి నేల మట్టానికి యించుమించు 1.5 అ. యెత్తున వుండేట్టు చూసి కప్పివేస్తారు. ఆ తరువాత బావి పైభాగాన్ని యిటుకలతో కట్టుటను కొనసాగించి ఆఖరికి నేలమట్టానికిపైన 6 అం. యెత్తువలకూ యిటుకగోడను కడతారు. అప్పుడు పైన, వుపయోగించబడిన పేడ ద్రవాన్ని పంపుటకై ఒక మురుగుకాలవను ఒదులుతారు. దానిగుండా అది యెండే ప్రదేశానికి కాని లేక గుంటలోకి కాని వెడుతుంది.

లోపలికి ద్రవాన్ని పంపే గొట్టం భూమిలో నుంచి వచ్చినచోట 2 అ. × 2 అ. × 2 అ. కొలతలుగల నలుచదరపు యిటుకగుండాన్ని కడతారు. అప్పుడు లోపలికి ద్రవాన్ని పంపేగొట్టం కొన యీ గుండంలోపలికి వస్తుంది. ఈ గుండంలో తగినంత మట్టిపోసి పైన యిటికలువేసికట్టి ఆ తరువాత గచ్చుచేస్తారు. ఈ నిర్మాణం గుండాపేడ ద్రవాన్ని రోజూ బావిలోపలికి వంపవచ్చు.

సరిగ్గా బావికిబయట ఒక చిన్న గుంట వుంటుంది. దానిలోపలి కొలతలు 9 అం. చదరం; 12 అం. లోతు. ఇది వాయుగొట్టంలో పేరుకున్న తేమను తొలగించుటకు వుపకరిస్తుంది. ఈ కుళాయిని కొన్నాళ్లకొకసారి తెరచి పేరుకున్న నీటిని తొలిగించి దానిని శుభ్రం చేస్తారు. ఆ తరువాత వాయువును, ఒదిలే గొట్టాన్ని ప్లీల్ కాక్‌తో కలుపుతారు.

# MODEL OF COW DUNG GAS PLANT




A. BRICK WALL
B. GAS HOLDER
C. IRON WIRE (6 PLY)
D. PULLEY
E. COW DUNG INLET PIPE.
F. SLURRY EXIT CHANNEL.
G. COW DUNG MIXING TANK.
H. DRYIN BED.
I. ANGLE IRON POSTS
J. GAS OUTLET PIPE
K. COUTERPOISE WEIGHTS
L. GROUND LEVEL.
M. EARTH PLATFORM
N. GAS MOISTURE EXIT TAP
O. SLURRY LEVEL.
P. FERMENTATION TANK
R. LEDGE
S. GAS COCK
T. GAS OUTLET TUBE
U. FIRE SAFETY PLUG
V. RUBBER TUBE
W. SLURRY PIT (ALTERNATIVE TO H)

ఆ తరువాత ముందు బావి నిండా పేడ ద్రవాన్ని నింపుతారు. పీపాను జాగ్రత్తగా బోర్లిస్తారు. అది బావిలో 4 అ. లోతున అట్టేపెట్టినగట్టు వరకూవెళ్లి దానిపై నిలుస్తుంది. లోపలగాలి దానిపైనగలరంధ్రందార్వా పైకివచ్చేస్తుంది.

పిమ్మటపైన పుల్లీలుగల ఆంగిల్ ఐరన్సులేక కొయ్యబల్లీలు బావిగోడ అవతల నేలమట్టానికి 6 అ. యెత్తున సమాన దూరంలో పాతబడతాయి.

3 కొయ్యపెట్టెలను 12అ.పొడవుగల మెలిపెట్టిన పీపాతీగకు కడతారు. దానిని పుల్లీలమీదుగా పోనిచ్చి పీపా పిడులకు కడతారు. పీపాబరువుతో సమంగా వుండుటకై ఒక్కొక్క పెట్టెలోను 8 యిటుకలను వేస్తారు. ఆ తరువాత పీపా రంధ్రం 6 అ. హౌస్ పైపుద్వారా వాయుగొట్టం పైనగల పంపుతో కలుపబడుతుంది. ఈ వాయుగొట్టం ఆంగిల్ ఐరన్సు లేక బల్లీలకు కట్టబడివుంటుంది.

## ఉత్పత్తి

ఈ వాయు యంత్రం యిప్పుడు పని ప్రారంభిస్తుంది. వాయువు వుత్పత్తి సాధారణంగా ఒక పక్షంలోపున ప్రారంభమవుతుంది. గాస్ కాక్ మూసి వేయబడుతుంది. పీపాలోపల పొగయే వాయువు దానిని తేల్చి పైకి యెత్తుతుంది. ఇందులో దానికి కొయ్యపెట్టెలు తోడ్పడుతాయి. వినియోగానికి వాయువు అవసరమయినప్పుడు పెట్టెలలో యిటికలను తీసివేసి పీపా ఒత్తిడితో వాయువును దానిని ఒదిలే గొట్టంలోకి పంపుతారు. గాస్ కాక్‌ను తెరచి వాయువును తగిన సాధనంలో మండిస్తారు. వాయువు వుత్పత్తి ప్రారంభమయాక యిదివరలో చెప్పినట్లు యించుమించు 100 పౌనుల పేడను ద్రవంచేసి లోపలికి పంపుతారు. ఇందువల్ల రోజూ యించుమించు 100 ఘ. అ. వాయువు వుత్పత్తి అవుతుంది. అది యిదివరకే చెప్పినట్టు 5 మందిగల కుటుంబం వంటకి సరిపోతుంది.

రోజూ పైకి పొర్లిపోయేమడ్డి చిక్కగా వుండి వేసవికాలంలో త్వరగా యెండిపోతుంది. దీనిలో 100కి 2 వంతులు నత్రజనివుంటుంది. ఇది పొలం యెరువుకంటే బలమయినది. వర్షాకాలంలోను యితర కాలాల్లోనూ పేడ ద్రవాన్ని పైకి తీసి పెంట యెరువుగుంటలలో వేయవచ్చు. దానితో గడ్డి దొరికిన యితరమలాలను వేసి మంచి సేంద్రియ యెరువును తయారు చేసుకోవచ్చు.

| సామగ్రి | | ఖర్చు రూ. |
|---|---|---|
| 1. 16 జి. ఎమ్. ఎస్. తో చేయబడిన పీపా. దీని వ్యాసం 5 అ. ఎత్తు 4 అ. ఒకవైపు తెరిచి వుంటుంది. మూసివున్న వైపున సమాన దూరంలో మూడు పిడులు వుంటాయి. తెరచివున్న వైపు అన్ని పక్కలా 1/2 అం. వ్యాసంగల యినుపకడ్డీ తాపడం చేయబడుతుంది. పీపాపైన అంచునుంచి 9 అం.లలో 1/2 అం. వ్యాసంగల రంధ్రం చేయబడుతుంది. దీనిలో 1/2 అం. వ్యాసం, 4 అం. పొడవుగల మొన చేర్చబడు తుంది. ... | | 150.00 |
| 2 ఒక్కొక్క పక్కన 1 1/2 అం. వెడల్పు, 12 అ. పొడవుగల ఆంగిల్ ఇరన్; ఇది ఒక కొసనుంచి 15 అం. దూరంలో సమకోణంలో వంచ బడుతుంది. రెండువైపుల షాఫ్ట్సు వుంటాయి. ... | 3 | 50.00 |
| (ప్రత్యామ్నాయం : ఇంచుమించు 4 అం. వ్యాసం, 10 అ. పొడవుగల కొయ్య బల్లీలు. ఒక కొసని మధ్యన 2 అం. వెడల్పు, 10 అం. పొడవుగల వివరం దొలచబడాలి ..... 3 రూ 20.00). | | |

| | సామగ్రి | | ఖర్చు<br>రూ. | |
|---|---|---|---|---|
| 3 | 3/4 అం. వ్యాసంగల హోస్ పైపు | ... | 8అ. | 6.00 |
| 4 | 7 అం. వ్యాసంగల యినప పుల్లీలు | ... | 3 | 4.00 |
| 5 | 3/8 అం. వ్యాసంగల జి I మెలిపెట్టిన 6 ప్లై వైర్ | ... | 45అ. | 5.00 |
| 6 | 15 అం. × 10 అం. × 12 అం. కొయ్య పెట్టెలు | ... | 3 | 5.00 |
| 7 | 10 అం. పొడవు, 4 అం. చదరముగల 22 జి I షీట్ గొట్టం (ద్రవాన్ని లోపలికి పంపేది) | .... | | 10.00 |
| 8 | 1/2 అం. వ్యాసంగల జి I పైపు | ... | 30అ. | 20.00 |
| 9 | 1/4 అం. వ్యాసంగల జి I పైపు | ... | 1అ. | 1.00 |
| 10 | 1/2 అం. జి I ఎల్బో | ... | 4 ముక్కలు | 2.00 |
| 11 | 1/2 అం. జి I సాకెట్ | ... | 4 ముక్కలు | 2.00 |
| 12 | 1/4 అం. తగ్గించబడిన 1/4 అం. జి I సాకెట్ | ... | 1 | 1.00 |
| 13 | 1/2 × 1/2 × 1/2 జి I టీ | ... | 1 | 1.00 |
| 14 | 1/2 అం. వ్యాసం, 6 అం. పొడవుగల బోల్టు, నట్లు (పుల్లీలకి) | | 3 | 2.00 |
| 15 | 1/2 అం. వీల్ కాక్ | ... | 1 | 3.00 |
| 16 | 1/2 అం గొట్టానికి నీటి కుళాయి | ... | 1 | 2.00 |
| 17 | 3 ఫర్స్ 8 అం. వ్యాసంగల రబ్బరుగొట్టం | ... | 8అ. | 2.00 |
| 18 | 1/2 అం. జి I బెండ్ | ... | 1 | 1.00 |
| 19 | 2 అ. చదరంగల యినుపరేకు | ... | 1 | 1.00 |
| 20 | బర్నర్ | ... | 1 | 5.00 |
| | బావికి | | | |
| 21 | ఇటుకలు (రెండవరకం) | ... | 1600 | 35.00 |
| 22 | సిమెంటు | ... | 1 క్వా.వైటు | 7.00 |
| 23 | ఇసుక (10 సి.ఎఫ్.టి.), రోరి (రాతి ముక్కలు) | ... | 5 సి.ఎఫ్.టి. | 5.00 |
| | | | | 320.00 |
| | | | కూలి ఖర్చు | 30.00 |
| | | | మొత్తం | 350.00 |

## సీలేజ్ పిట్

160 ఘ. అ. లేక 8 అ. × 4 అ. కొలతల గుంట 100 మణుగుల పశుగ్రాసానికి సరిపోతుందని అంచనా వేయబడింది. ఇది జత పశువులకి రెండునెలలు సరిపోతుంది. గ్రామంలో సగటు కుటుంబానికి సాధారణంగా జత యెడ్లు ఒక గేదె, ఆవు, రెండుదూడలు వుంటాయి.

5 పెద్దవాటికి 6 నెలలకి గ్రాసం నిమిత్తం 10 అ. × 10 అ. × 6 అ. కొలతలుగల2 గుంటలు కావాలి. వాటిలో 1200 మణుగుల పచ్చిగ్రాసాన్ని వేయవచ్చు. జొన్న మంచి పశుగ్రాసమని కనుగొనబడింది. దినిని 2 యెకరాల జొన్నచేనునుంచి పొందవచ్చు.



వ్యవసాయ శాఖామంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి ప్రదర్శనను ప్రారంభిస్తున్న దృశ్యం

## రుద్రూరులో

# వ్యవసాయ పరిశోధన

నిజామాబాదు జిల్లా రుద్రూరు వ్యవసాయ పరిశోధన కేంద్రం 2-12-58 న రజతోత్సవం జరుపుకుంది. దేశాభివృద్ధికి రైతుల సౌభాగ్యం మిక్కిలి ముఖ్యమన్న విషయం స్వాతంత్ర్యసిద్ధి పిమ్మటనే గుర్తించబడినదని యీ ఉత్సవాలను ప్రారంభిస్తూ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి అన్నారు. నాయకత్వం దేశానికి వెన్నెముక అయిన గ్రామాల నుంచే రావాలన్నారు.

పరిశోధక కేంద్రంలో జరిగిన కృషిని ప్రశంసిస్తూ ఆయన యిలా అన్నారు : గుంటూరునుంచి నిజామాబాదు జిల్లాకి వచ్చి అక్కడ నీటి పారుదల వ్యవసాయాన్ని అభివృద్ధిపరిచిన రైతులను అభినందించాలి. ఆంధ్రలో డెల్టా ప్రాంతాల సగటు ఉత్పత్తి అదే పరిస్థితులలో ఉత్తరప్రదేశ్, బెంగాలులలో ఉత్పత్తి కంటె హెచ్చు.

ఈ ఉత్సవానికి అధ్యక్షత వహించిన వ్యవసాయ శాఖామంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి రైతులు ఐకమత్యంతో వ్యవహరించాలన్నారు. వారు తమ కష్టాలనుగురించి గట్టిగా చెప్పుకోనిదే రైతు సంక్షేమాన్ని యోగ్యంగా కాంక్షించే ప్రభుత్వమయినా వారి సమస్యలను పరిష్కరించలేదన్నారు. పంటల భీమాను, పశువుల బీమాను వెంటనే ప్రవేశపెట్టాలన్నారు.

ఈ ఉత్సవాలకు కర్షకులే తలపెట్టడం గమనార్హమయిన విషయమని వ్యవసాయశాఖ డైరెక్టరు

శ్రీ రాయ్ పృథ్వీరాజ్ అన్నారు. అందునిమిత్తం వసూలు చేయబడిన రూ. 14,000 లలోను యెక్కువ భాగం వారే యిచ్చారు. ఈ సందర్భంలో వివిధ జాతి నిర్మాణశాఖల ప్రగతిని సూచించే ప్రదర్శన ఒకటి యేర్పాటు చేయబడింది.

హైదరాబాదు వ్యవసాయ కళాశాలలో వ్యవసాయ శాస్త్రాన్ని అభ్యసించే విద్యార్థులలో వుత్తమ విద్యార్థికి యిచ్చుటకై ఒక విద్యార్థి వేతనాన్ని ప్రవేశపెట్టాలని సంకల్పించబడిందని రజతోత్సవ సంఘ కార్యదర్శి శ్రీ లక్ష్మీచంద్ అన్నారు.

రుద్రూరు వ్యవసాయ పరిశోధనకేంద్రం 1931లో ప్రారంభించబడింది. ఇక్కడ వ్యవసాయ సంబంధమైన అనేకరకాల సమస్యలు పరిశోధించబడుతున్నాయి. ఈ సందర్భంలో, నిజాంసాగర్ ప్రాజెక్టు ప్రాంతంలో ప్రధానంగా వుత్పత్తిఅయే చెఱకు, వరిపంటల పరిశోధనకి ప్రత్యేక ప్రాధాన్యం యివ్వబడుతున్నది. ఈ కేంద్రానికి 149 యెకరాల క్షేత్రం వున్నది. దానిలో 20 యెకరాలలో ఫలవృక్షాలు పెంచబడుతున్నాయి. ఆయా నిపుణులు కనుగొన్న విషయాలలో కొన్ని యీ రజతోత్సవ సంచికలో పొందుపరచబడ్డాయి. వాటి వివరాలు సంగ్రహంగా దిగువ యివ్వబడ్డాయి.

ఈ పరిశోధన కేంద్రం ముఖ్యంగా నిజాంసాగర్ ప్రాజెక్టుక్రింద నీటి పారుదల వ్యవసాయం విషయంలో ప్రత్యేక పాత్ర వహించవలసి వున్నది. ఈ కేంద్రంలో పరిశోధనద్వారా తోడ్పడ సంకల్పించిన ప్రాంతం చెఱకు, వరిపంటల దృష్ట్యా ముఖ్యమైనది; అక్కడ పళ్ళు, ప్రత్తి, కొబ్బరికాయలు, జొన్న, మొక్కజొన్న, పప్పుదినుసులు, వేరుసెనగవంటి నూనె గింజలు, మిర్చిలను వుత్పత్తిచేసే అవకాశంవుంది. సిబ్బంది, సౌకర్యాలు, భవనాలు, పరికరాలు మున్నగు అన్నిటిని సమకూర్చి యీ కేంద్రాన్ని సత్వరంగా అభివృద్ధి చేయవలసివున్నది. అప్పుడు అది మొదటి తరగతి ప్రాంతీయ పరిశోధనా సంస్థగా రూపొంది నిజామాబాదు, మెదక్, ఆదిలాబాదు, కరీంనగరం జిల్లాలకి సంబంధించిన అన్ని వ్యావసాయిక సమస్యలకు పరిష్కార మార్గాలను కనుగొనుటకు వీలు కలుగుతుంది.

వరిలో, తీవ్ర పరిశోధన జరుగుతున్న జపానికా ఇండికారకాలు, యితర రకాల వాడకం వుత్తమ వ్యవసాయ పద్ధతుల అవలంబన యీ ప్రదేశం ఆర్థిక వ్యవస్థలో ముఖ్యమైన పాత్ర వహించవచ్చు. కొత్త రకాల చెఱకు విత్తనం వాడకం, ఆధునిక సాగు, యెరువు లేతపద్ధతుల అవలంబనవల్ల యీ ప్రదేశం ముందుముందు సౌభాగ్యవంతం కాగలదు. ఈ కేంద్రం భూసారం, ఫలవృక్షాల పెంపకం, కొబ్బరి, పోకచెట్లు అభివృద్ధిల విషయంలో పరిశోధనను తీవ్రం చేసి, యీ ప్రాంతంలో పెరుగగల పంటల విషయంలో పరిశోధనను ప్రారంభించాలి. భూమి అభివృద్ధి, మురుగు పారుదల సమస్యలకు ప్రత్యేక ప్రాధాన్య మివ్వబడాలి.

## చెఱకు సాగు

1930 కి పూర్వం పూర్వ హైదరాబాదు రాష్ట్రంలో చెఱకు అక్కడక్కడ కొన్నిచోట్ల బావులు, చెరువులక్రింద మాత్రమే పండించబడేది. ఇది యెక్కువగా బెల్లం తయారీకి, తినుటకు వుద్దేశించి పండించబడేది. అప్పుడు వ్యాప్తిలోనున్న చెఱకు రకాలు అనగా పుండ్య, నామాలచెఱకు, దాసెరచెఱకులు అంతమంచివికావు. తోటలకు తరుచు నీటి పారుదల అవసరమయేది. అవి చీడలకు, వ్యాధులకు గురిఅయే అవకాశముండేది.

నిజాంసాగర్ ప్రాంతంలో చెఱకుఫ్యాక్టరీ నెలకొల్పబడుతుందనే విషయం 1934 లో ధృవపడింది. దానితోపాటే పంచదార వుత్పత్తికి అధికంగా కావలసి రాగల చెఱకును సరఫరా చేయుటకై మేలిరకం చెఱకు, యెక్కువపండే రకం చెఱకుల సాగు ప్రారంభించబడింది.

నిజామాబాదు జిల్లాలో చెఱకుపంట క్రిందగల 43,000 యెకరాలలోను యిప్పుడు 100 కి 90 వంతులు సి. 419 క్రింద వుంది. కం. 467 తాజాగా ప్రవేశపెట్టబడి విస్తృతంగా పరిశీలించబడుతున్నది. ఇది కం. 419 కంటె ముఖ్యంగా రేగడ భూములలో



2-12-58 రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి రుద్రూరులో వ్యవసాయ పరిశోధనా కేంద్రం రజతోత్సవాలను ప్రారంభిస్తున్నారు

హెచ్చుగా పండుతున్నట్టు తేలింది. ముందుగా ఆడుటకై కం 527 విడుదల చేయబడుతుంది. కం 527 లో తొందరగా ముదిరే వాంఛనీయమయిన లక్షణం వుంది. 'అడ్సాలి'గా పాతినప్పుడు అది కం 419 కంటె బాగా పండుతుంది. ఈ రకం చెఱకు బెల్లం నాణ్యంగా వుంటుంది. చక్కని పరిమళంతో వుంటుంది. అయితే వచ్చిన చిక్కేమంటే దానిని **Strip** చేయడం కష్టం.

చెఱకును బెల్లం తయారీకి కాక పంచదార తయారీకి ఉత్పత్తి చేయవలసి రావడంతో సాగు, యెరువు లేతపద్ధతులలో చాల మార్పు అవసరమయింది. మొదటిమార్పు, చెఱకును చదును నేల మీద కాక చాలులలో పాతుట. ఇందువల్ల తోటలకి యెక్కువ తరుచుగా నీరు పెట్టవలసిన అవసరం తప్పింది. సాగుపనులు పెక్కిటికి యెద్దులలాగే పరికరాల వాడకానికి వీలుకలిగింది. ఆ తరువాత మామూలు పద్ధతి ప్రకారం 10-20 బళ్లపాలం యెరువును వేయుటకు బదులు యెరువుల వేతలే ప్రణాళిక తయారు చేయబడింది. పంట లాభదాయకంగా వుండాలంటే యెకరానికి 225 పౌనుల నత్రజనిని వేయాలని కనుగొనబడింది. ఈ నత్రజని మిక్కిలి చవకగా వేరుసెనగ పిట్టుతో లభిస్తుంది. అమ్మోనియం సల్ఫేటు అందుబాటులో వుండుటతో యీ సిఫార్సు మార్చబడింది. దాని ప్రకారం అమ్మోనియం సల్ఫేటు, వేరుసెనగ పిట్టులను నత్రజని ప్రాతిపదికపై 1:2 నిష్పత్తిలో వేయాలి. ఈ యెరువును 3 దఫాలు వేయుట ఉత్తమపద్ధతి. మొక్కలు నాటునపుడు అమ్మోనియం సల్ఫేటు ద్వారా 25 పౌనుల నత్రజనిని వేయాలి. మిగిలినదానిని రెండు సమభాగాలుచేసి మొక్కలు నాటిన 2 వ, 5 వ నెలల్లో వేయాలి. 'అడ్సాలీ' పంటకి అలాగే 350 పౌ. నత్రజనిని వేయాలి. ఇదికాక ఈ రెండిటికీ కూడా మొక్కలు నాటే సమయంలో 50 పౌ. భాస్వరామ్లాన్ని వేస్తే మంచిది.

వేరుసెనగ పిట్టుధర అధికంగా వున్నందునను, అది అందుబాటులో లేనందువల్లను దానికి బదులు వాడదగు పచ్చియెరువుల విషయంలో ప్రయోగాలు జరుపబడుతున్నాయి. ఇప్పుడు కాల్చివేయబడుతున్న

చెఱకుతుక్కుతో పెంటయెరువును తయారు చేయవచ్చు. ఒకయెకరం ఏక్‌సాలీ పంటనుంచి 5 టన్నుల పెంటయెరువును తయారు చేయవచ్చునని కనుగొనబడింది. ఏక్‌సాలీ, అడ్సాలీ పంటలను వేయుటకు, కోయుటకు వుత్తమ సమయాలను నిర్ణయించే విషయంలో కూడా ప్రయోగాలు జరుపబడినవి. వాటి ఫలితంగా ఏక్‌సాలీ పంటను నవంబరులో వేసి, జనవరి-ఫిబ్రవరి నెలల్లో కోస్తే లాభకరమని కనుగొనబడింది. అలాగే అడ్సాలీపంటను 'జూన్-జూలై లో వేసి డిసెంబరు-జనవరి నెలల్లో కోసుకుంటే మంచిది,

హెచ్చు వుత్పత్తికి వుపకరించే యితర సిఫార్సులు యివి: ఆరోగ్యకరమైన మూడు మొగ్గల సెట్స్‌ను యెన్నుకోవాలి. విత్తనం ప్రయోజనాలకై నాట్లకు ముందు 6 నెలలనుంచి విడిగా నారు పెంపక కేంద్రంలో చక్కగా పెరిగే గెడలను గెడలో పై సగాన్ని కాని పూర్తిగెడను కాని వుపయోగించాలి. సాగుపనులకై యెద్దులతో నడిచే బరోడా కల్టివేటర్, మౌల్డుబోర్డు నాగలి, రిడ్జరీలవంటి పరికరాలను వాడితే సాగుఖర్చు బాగా తగ్గగలదని కూడా కనుగొనబడింది.

సిఫార్సుచేసిన పద్ధతుల లాభనష్టాలను పరిశీలించినప్పుడు ఖర్చు యెకరానికి యించుమించు రూ. 100 తగ్గగలదని, రాబడి యించుమించు రూ. 200 హెచ్చగలదని తేలింది. ఈ విధంగా యిందువల్ల యెకరానికి మొత్తం రూ. 300 లాభం వస్తుంది.

## కొత్తరకం వరి విత్తనాలు

ఈ ప్రాంతం రైతులకు వరిసాగు లాభదాయకం కావాలంటే వరిపంట తక్కువ వుత్పత్తికి కారణాలను పరిశీలించి వాటిని అధిగమించుటకు ప్రయత్నించాలి. ఈ అభిప్రాయంతో యీ వ్యవసాయ పరిశోధన కేంద్రంలో వరి విభాగం 1942 లో ప్రారంభించబడింది. జిల్లాలో యే యే రకాలు సాగు చేయబడుతున్నాయో, సాగు, యెరువు వేత పద్ధతులు యెట్టివో, యెంత పంట పండుతున్నదో తెలుసుకొనుట కవసరమయిన పరిశీలనతో యిక్కడ పని ప్రారంభించబడింది. ఉత్తమరకం వరి విత్తనాల సాధనకై పని ప్రారంభించబడింది. రెండు వ్యవసాయ ఋతువులకు హెచ్. ఆర్. 19 ఆబీ ఋతువుకి హెచ్. ఆర్. 35 సిఫార్సు చేయబడినవి. ఎక్కువ కాలానికి పండే రకాలు, ఒక్కసారి విత్తనాలు జల్లే రకాలకి బదులు మొదట నారుమడిలో నారుపెంచి తరువాత పొలంలో వూడ్చే రకాలగురించి కూడా ప్రజలకు తెలియచేయబడింది.

తొందరగా, మధ్యకాలంలో, ఆలస్యంగా పంటకి వచ్చే రకాల యెన్నికకై 1948 లో ప్రారంభ యెన్నిక పని ప్రారంభించ బడింది. జిల్లా పెరినియల్ జోన్‌లో మెట్టప్రాంతాల రైతుల అవసరాలను నీటి కొరత తీవ్రంగా వున్న కామారెడ్డి తాలూకా రైతుల అవసరాలను తీర్చుటకై మిక్కిలి త్వరగా పంటకి వచ్చేరకం 'రాజగర్యాల్' యెన్నబడింది. దీనినుంచి ఆర్ డి ఆర్ 4, ఆర్ డి ఆర్ 7, ఆర్ డి ఆర్ 2 అనే 3 వుత్తమ రకాలు సాధించబడినవి. వీటిలో మొదటిరకం ఆలస్యంగా పంటకు రాగా మిగిలిన రెండు త్వరగా పంటకు వస్తాయి. ఇవి స్థానిక రకాల కంటె 13-16 శాతం యెక్కువ పండుతాయి. ఆర్ డి ఆర్ 7 త్వరగా పంటకి రావటమే కాక హెచ్చుగా కూడా పండుతుంది. ధాన్యం మధ్యరకంగా వుంటాయి. ఇవన్నీ కూడా వాంఛనీయమైన లక్షణాలే. ఈ క్షేత్రంనుంచి విడుదలయిన రకాలపట్ల రైతులకు శ్రద్ధ పెరిగింది. అవి రమారమి 50,000 యెకరాలలో పండించ బడుతున్నాయి. వీనిని జల్లుటకు ఆబీ ఋతువులో మే, మూడవవారం నుంచి జూన్ రెండవవారం వరకును, తాబీ ఋతువులో జనవరిలో సగంకాలం గడచిన పిమ్మటను వుత్తమ మయిన సమయం అని కనుగొన బడింది.

ఇప్పుడు 'శంబోసల్', 'బసంగి' రకాలలో యెన్నిక జరుగుతున్నది. బసంగి అక్కుళ్ళకంటె 15 రోజులు ముందుగా పంటకు వస్తుందని, వుత్పత్తి కూడా దానికంటె హెచ్చుగా వుంటుందనీ కనుగొనబడింది.

1954-55 నుంచి 7 విదేశాలనుంచి 69 రకాలు, భారతదేశం వివిధ ప్రాంతాలనుంచి 240 వుత్తమ

రకాలు సేకరించ బడినవి. వీటిలో యీ ప్రాంతా నికి యేవేవి తగివుంటాయో పరిశీలించ బడు తున్నది. మూడురకాల కలయిక వల్ల యేర్పడిన మధ్యప్రదేశ్ రకం, చైనారకం మూలం కలసి పి.హెచ్. 45 రకాలు యీ ప్రాంతంలో ప్రవేశ పెట్ట బడినవి. సి. హెచ్. 972, సి. హెచ్. 975 వంటి చైనారకాలు, ఎమ్.టి.యు. 15. ఎస్.ఎల్.ఓ. 13, ఆర్. 8-లూచీ అండ్ కైతూ-222 వంటి ఇండియా రకాలు బాగా పెరుగుతున్నాయి.

## భూమిరకాలు

నిజాంసాగర్ ప్రాజెక్టు క్రిందగల ముఖ్యమయిన రెండు రకాల భూములు యివి: 1. రేగడనేలలు. 2. 'చలకలు' అనబడే యిసుక నేలలు. రేగడినేలలు నీటి పారుదలతో సాగుచేయిట కనువయినవి కావనే పొరపాటు అభిప్రాయం వల్ల అవి సాధారణంగా నీటి పారుదల క్రింద సాగుచేయ బడవు. అయితే తగిన వ్యవసాయ పద్ధతులను అవలంబించి రేగడి నేలల్ని కూడా నీటి పారుదల క్రింద సాగుచేయ వచ్చునని పూర్వ హైదరాబాదు ప్రభుత్వ వ్యావ సాయ రసాయన వేత్త స్వర్గీయ డా. పి. జి. కృష్ణ చెప్పారు. లేబొరేటరీలో జరిపిన తీవ్ర పరిశోధన, పొలాల్లో జరిపిన ప్రయోగాలవల్ల నల్లరేగడిభూములు స్వల్పంగాను, అధికంగాను నీటి పారుదలకు తగి వున్నాయని నిర్ధారణ అయింది.

గడచిన సంవత్సరాలలో వరిపంట సరిగా పండ లేదు. ఇందుకు కారణాలు పరిశీలించ బడినవి. భూమిలో క్షార లక్షణంవల్ల పంట పండుట లేదని అనుమానించ బడింది. కాని అది చాల స్వల్ప కారణం కాగా యిందుకు ముఖ్యకారణం భాస్వర పదార్థం లేమి అని కనుగొన బడింది. నల్లరేగడ భూములలో అందుబాటులోనున్న భాస్వర పదార్థం తక్కువగా వున్నందున, వాటికి నీటిలో కరిగే సూపర్ ఫాస్ఫేటు వంటి భాస్వర పదార్థాలను తగినంతగా వేయాలి. నిజానికి, నత్రజనికి తోడు భాస్వర పదార్థాలను కూడా యెరువుగా వేస్తే నల్లరేగడ భూములలో వరిపంట రెట్టింపు హెచ్చి నట్టు కూడా కనుగొన బడింది. ఒకప్పుడు ఒలిచి వేయబడిన భూములు బాగా వరి పంటపండే భూము లుగా మారుటకు యిదేకీలకం.

అప్పుడు వరి పండే రెండురకాల భూములకు యెంతెంత నత్రజని, భాస్వరం యెరువులు వేయ బడాలో లెక్క కట్టబడింది. ఎరువు వేసే పద్ధతి, సమయం కూడా నిర్ధారణగాసూచించ బడ్డాయి. భాస్వరం యెరువుల్ని ఆఖర్ని ఒక్కసారిగా వేయడం వుత్తమం కాగా నత్రజనిని త్వరగా పని చేస్తూ వెంటనే నీటిలో కరిగిపోయే రసాయన యెరువుల ద్వారా రెండు దఫాలుగా (నాటుటకు పూర్వం సగం, పూతకి ముందు దశలో మిగిలిన సగం) వేయడం వాంఛనీయం. సాధారణంగా నత్రజని, భాస్వరామ్లాలను చలక నేలలకు 2.1. నిష్పత్తిలోను, రేగడ భూములకు 4:3 నిష్పత్తిలోను వేస్తే బాగుంటుంది.

ఈ విషయాలు తెలియుటవల్ల రసాయన యెరు వుల వాడకం హెచ్చింది. కాని రసాయన యెరు వులు చాలినన్ని లేనందున యితర రకాల యెరు వుల్ని యెక్కువ చేయవలసి వచ్చింది. ముఖ్యంగా చవుకగా నత్రజనిని సరఫరా చేస్తూ భూమిలోలేని సేంద్రియ పదార్థాన్ని కూడా యిచ్చే పచ్చి యెరు వుల్ని హెచ్చించుకోవలసి వచ్చింది. తాబీ, ఆబీ ఋతువుల మధ్యకాలం పచ్చి యెరువుల పంటకి మిక్కిలి తగివున్నది. ఈ కాలంలో యెకరానికి దగ్గరగా 50 పౌనుల నత్రజనినిచ్చే యింతమించు 10,000 పౌనుల పచ్చియెరువు మొక్కల్ని పెంచ వచ్చు. తాబీ పంట పైరుకోతలకి ముందు నీటిని కట్టేసేటప్పుడు పచ్చియెరువు విత్తనాలను జల్లడం చాలా వుత్తమం అని కూడా కనుగొన బడింది.

## ఫలాలు

నిజాంసాగర్ ప్రాజెక్టు క్రింద ఫలోత్పత్తికి, సౌష్ఠవమయిన పద్ధతిలో యీ పరిశ్రమ విస్తృతీకర ణకుగల అవకాశాలను పరిశీలించుట వుద్యానవన విభాగం ప్రధానాశయం. ఈ ఆశయం దృష్ట్యా యీ కేంద్రంలో వివిధ ఫలవృక్షాలతోకూడిన పైల

ట్ తోట, పళ్ల మొక్కల నారుపెంపక కేంద్రము కూడా యేర్పాటు చేయబడ్డాయి. సాత్కూడి, కొబ్బరి, పోకచెట్లు తప్ప మామిడి, సపోటా, ద్రాక్ష వంటి యితర ఫలజాతులు చక్కగా కాస్తూ యీ ప్రాంతంలో వాటిని వాణిజ్య రీత్యా పెంచుటకు అవకాశాలు గలవనే సూచనను యిస్తున్నవి.

నారుపెంపక కేంద్రం విస్తీర్ణం 5 యెకరాలు. అక్కడ 5 రకాల మామిడి మొక్కలు, 6 రకాల నిమ్మజాతి మొక్కలు, రెండు రకాల జామి మొక్కలు పెంచబడుతున్నాయి.

జాతి మొక్కల నారును తోటలకు సరఫరా చేయుటకై ఇక్కడ యివి పెంచబడుతున్నాయి. ఈ కేంద్రాలనుంచి గడచిన 8 సంవత్సరాలలోను పంపిణీ చేయబడిన పళ్ల మొక్కల వివరాలు యివి:

| సంవత్సరం | పంపిణీఅయిన వాటి సంఖ్య |
|---|---|
| 1950-51 | 533 |
| 1951-52 | 2,051 |
| 1952-53 | 3,424 |
| 1953-54 | 3,631 |
| 1954-55 | 3,620 |
| 1955-56 | 4,364 |
| 1956-57 | 6,976 |
| 1957-58 | 30,677 |
| మొత్తం | 55,376 |

## అరటి

త్వరగా యెదిగి సత్వరంగా యెక్కువగా ఫలించే లక్షణాన్నిబట్టి యీ ప్రాంతం పరిస్థితులలో వ్యాపారానికై పండించుటకు బ్రసాయ్ మిక్కిలి తగవునట్టు కనుగొనబడింది.

## కొబ్బరి

కొబ్బరి తోటల పెంపకాన్ని వ్యాప్తంచేయుటకై మంచిరకం కొబ్బరి విత్తనాలు పశ్చిమకోస్తానుంచి, తూర్పుగోదావరి జిల్లానుంచి కూడా సేకరించబడ్డాయి.

1952 నుంచి నాణ్యమయిన కొబ్బరి నారుపెంచబడుతున్నది. ఇంతవరకూ 8,250 పైగా నారు మొక్కలు పంపిణీచేయబడినవి. ఇంచుమించు 96 మైళ్ల పొడవుగల నిజాంసాగర్ ప్రధాన కాలవ గట్లపై వాటిని నాటితే లాభించగలదు.

## కూరగాయలు

కూరగాయల వాడకం నిరంతరం హెచ్చుతున్నందున టొమాటో, వంగ మున్నగు జాతులలో పుత్తమ జాతుల విత్తనాల వుత్పత్తి చేపట్టబడింది. గడచిన 5 సంవత్సరాలలోను అన్నిరకాల కూరగాయల విత్తనాలు మొత్తం 2,165 పౌనులు రైతులకు సరఫరా చేయబడినది.

## ఫలితాలు

పరిశోధన కేంద్రంలో గణించిన అనుభవం దృష్ట్యా అక్కడ పెంచిన పళ్లమొక్కలన్నిటిలోకి సపోటా బాగా పెరిగినదని చెప్పవచ్చు. అది హెచ్చు నీటిటేబుల్ పరిస్థతులను తట్టుకున్నది. ఈ విషయంలో దాని తరువాత జీడిమామిడి, జామిచెట్లు వస్తాయి. అధిక తేమపరిస్థితులలో ద్రాక్ష, అత్తి' దానిమ్మచెట్లు వ్యాధికి, చీడలకు గురయినవి. వంగను నాటుటకు వుత్తమమయిన కాలం ఆగస్టు రెండవ పక్షం అని కనుగొనబడింది.

ఈ విధంగా నిజాంసాగర్ ప్రాంతంలో ఫలవృక్షాల పెంపకానికి పూర్తి అవకాశాలున్నాయి. వీటిలో నిమ్మజాతి, అరటి, కొబ్బరి మొక్కలు లాభకారులుగా కనబడతాయి.

—:o-o:—

# దంపుడుబియ్యం విశిష్టత

ప్రపంచంలో వరిపండించే ముఖ్యమయిన దేశాలలో భారతదేశం ఒకటి. మనదేశంలో యెక్కువ మంది ప్రజల ప్రధానాహారం వరి. దక్షిణ భారతం మొత్తంలోను, బెంగాలు, అస్సాం, బీహార్, ఒరిస్సాలలోను, బొంబాయి, వుత్తర ప్రదేశ్‌లలోని కొన్ని ప్రాంతాలలోను ప్రజలు వరి అన్నాన్నే తింటారు.

భారతదేశంలో వరి విస్తృతంగా పండించబడుతుంది. 1952-53లో రమారమి 750 లక్షల యెకరాలు వరిపంట క్రింద వున్నట్టు అంచనావేయబడింది. ఇటీవలి సంవత్సరాలలో వరిపంట క్రింది భూమి విస్తీర్ణం, వరి వుత్పత్తికూడా క్రమేణా హెచ్చుతున్నాయి. స్వయం సమృద్ధి సాధనకృషిలో హెచ్చునీటి పారుదల సౌకర్యాల కల్పన, హెచ్చురసాయన యెరువుల వాడకం, హెచ్చుభూమిని సాగు క్రిందకు తెచ్చుట యిందుకు కారణమని చెప్పవచ్చు.

తొలి పంచవర్ష ప్రణాళిక వరి అధికోత్పత్తిని పలపెట్టింది. ప్రణాళికా కాలంలో అది 40 లక్షల టన్నులు అని అంచన వేయబడింది.

## ప్రాచీన పరిశ్రమ

ఒడ్లదంపు భారతదేశంలో ప్రాచీనమైన గ్రామ పరిశ్రమ. ఇది యెంతోమంది గ్రామీణులకు ముఖ్యంగా స్త్రీలకు పనిచూపిస్తుంది. అది పూర్తికాలం, సగంకాలంకూడా పని చూపిస్తుంది. వాణిజ్య ప్రయోజనాల విషయంలో పూర్తికాలం కార్మికులు పనిచేస్తారు. ఇంటివాడకానికయితే వినియోగదారులే తమ తీరికకాలంలో ఒడ్లు దంపుకుంటారు. సమిష్టి మద్రాసు రాష్ట్రం తప్ప బియ్యం తినే రాష్ట్రాలన్నీ యించుమించు దేశీయ పద్ధతికే అంటే ఒడ్లను దంపే పద్ధతికే కట్టుబడివున్నాయి.

ఇతర కుటీర పరిశ్రమలవలె కాక ఒడ్లదంపు పరిశ్రమ చాలవరకూ మిల్లుల పోటీతో అణగారిపోకుండా నిలువగలిగింది. ఇటీవలి సరకూ బియ్యం చేయబడే మొత్తం ధాన్యంలో మూడువంతులు దంపబడేవి, మిగిలిన ఒకవంతు మిల్లుల్లో పోయబడేవి. అయితే రేషను ప్రయోజనాలకై ప్రభుత్వ కంట్రోళ్లు, సేకరణలు సాగిన కాలంలో ముఖ్యంగా యుద్ధానంతరం యీ ప్రాచీన గ్రామ పరిశ్రమ తీవ్రంగా దెబ్బతిన్నది. ఈ కాలంలో దంపబడిన ధాన్యం శాతం 60కి పడిపోయిందని అంచనా వేయబడింది.

దంపుడు బియ్యం లాభాలను లెఖ్కవేసే ముందు దంపు ప్రయోజనాన్ని అర్థం చేసుకొనుటకై ఒడ్లగింజ నిర్మాణాన్ని తెలుసుకోవాలి. చిట్టుగా పోయే ఒడ్లగింజ పైభాగం మొత్తం గింజలో 100కి 23 నుంచి 25 వంతుల వరకూ వుంటుంది. ఒడ్లు బియ్యం కావడానికి దీనిని తొలగించాలి. ఈ పైపూకకి క్రింద గింజపై మరిరెండు పలుచని పొరలు వుంటాయి. అందులో అడుగు పొరలో బలవర్థక పదార్థాలు అధికంగా వుంటాయి.

గింజ అడుగున వుంటుంది. పలుచని పొరలలో పై దానిలో కొన్ని బలవర్థక పదార్థాలు వుంటాయి. కాని గింజ బరువులో 100కి 1-1/2-2 వంతులు వుండే అడుగుపొరలోనే అధికభాగం విటమిన్లు (ఎ+బి), మాంసకృత్తులు, కొవ్వుఖనిజ పదార్థాలు యిమిడి వుంటాయి.

## మరపడితే

మిల్లుల్ని అవివాడే యంత్రాలనుబట్టి షెల్లరు, హల్లరు అనిరెండు రకాలుగా విభజించవచ్చు. ఇప్పుడున్న మిల్లుల్లో అధికభాగం రెండవ తరగతివే. హల్లరలో పోసిన ధాన్యంనుంచి యెక్కువ బియ్యం రావు. కాబట్టి వాటివల్ల దండుగ వస్తుందనేది అంగీ

కరించబడిన విషయం. పైపొట్టును, దాని క్రింది పలుచని పొరలలో పైపొర జీర్ణంకాదు కాబట్టి దానిలో కొంతభాగాన్ని తొలగించుట ప్రధానాశయం. కాని మరపట్టుటలో అడుగు పలుచని పొరలు రెండూ పోతాయి.

బియ్యం మెరుగు యెక్కువయినకొలదీ భాస్వర పదార్థం కూడా తగ్గిపోతుంది. బాగామిల్లు పట్టిన రకాలలో అసలువున్న భాస్వరంలో 100కి 12-30 వంతులు మాత్రమే మిగులుతోంది. భాస్వరంకంటె ముఖ్యమైనది బియ్యం పైపొరలలో యెక్కువగా వుండే విటమిను పదార్థాం. దుష్ట పద్ధతులలో తయారీవల్ల దానిలో చాలభాగం పోతుంది. అట్టి లోపంగల బియ్యాన్ని యెల్లప్పుడూ వాడితే బెరి-బెరి వ్యాధివస్తుంది. బియ్యం తయారీలో జరిపిన ప్రయోగాలవల్ల దిగువ విషయాలు తేలాయి: దంపుడు బియ్యంలో విటమిన్‌బి యెక్కువగా వుంటుంది. మిల్లు బియ్యంలో ముఖ్యమయిన యీ ఆహార పదార్థంలోపిస్తుంది. మిల్లు బియ్యంలో విటమిను పదార్థం హెచ్చుగా వుంటుంది. ఉప్పుడు (దంపుడు)బియ్యంలో అది పచ్చి (దంపుడు)బియ్యంలో కంటె యెక్కువవుంటుంది. పచ్చి బియ్యంలో అసలు వున్న విటమిన్ 'బి'లో రమారమి 2/3 వంతులు పోతుంది. ఉప్పుడు బియ్యంలో సాధారణంగా మన దేశంలో పెట్టే మెరుగుకి 1/3 మాత్రమే పోతుంది. ఉడకబెట్టిన ఒడ్లను బాగామిల్లు పట్టినప్పటికీకూడా విటమిన్ 'బి'లో చాలభాగం దక్కుతుంది.

ఒడ్లను వుడకబెట్టినప్పుడు బియ్యం పైపొరలలో గల విటమిన్లు, యితర బలవర్ధక పదార్థాలలో కొన్ని గింజలో వ్యాపిస్తాయేమో, ఆ తరువాత మిల్లు పట్టినప్పుడుకూడా వాటిని తొలగించుటకు అవకాశం వుండదు కాబోలు. బహుశా అందువల్లనే ధాన్యాన్ని వుడకబెట్టినప్పుడు బియ్యం ఆహార విలువలో ఆశ్చర్యకరమయిన మార్పు వస్తుండవచ్చు. ఉదాహరణగా పచ్చి బియ్యం, వుప్పుడు బియ్యం, మిల్లు బియ్యాలలోగల విటమిన్ పరిమాణం వివరాలు దిగువయివ్వబడినవి:

| దంపుడు బియ్యం | ఉడకబెట్టిన మిల్లు బియ్యం (ప్రతి గ్రాముకి మైక్రోగ్రాములో) | పచ్చి మిల్లు బియ్యం |
|---|---|---|
| 4.0 | 1.7 | 1.1 |
| 4.2 | 2.1 | 0.5 |

బియ్యాన్ని మరపట్టడంవల్ల బలవర్థక పదార్థం పోయి దంపుడుబియ్యంకంటె మరబియ్యం బలహీనం కాగలవని పై దానివల్ల స్పష్టపడుతుంది. పౌష్టికాహార నిపుణుల అభిప్రాయం ప్రకారం, దంపుడు బియ్యం పౌష్టికాహార ప్రమాణం మనిషికి కావలసిన ప్రమాణమని విస్తృతంగా అంగీకరించబడిన ప్రమాణంతో తుల్యమయినది. ఉప్పుడు బియ్యం విషయంలో, మిల్లుపట్టబడినప్పటికీ బలవర్థక పదార్థాలు కొంత వరకూ నిలుస్తాయి. ఆ విధంగా మిల్లు పచ్చిబియ్యం కంటె వుప్పుడుబియ్యం కాస్త మెరుగు. అస్సాం, బెంగాలు, బీహారు, ఒరిస్సాలలో అధికసంఖ్యాకులు, మద్రాసు, ఆంధ్రప్రదేశ్‌లలో కొంతవరకూను ప్రజలు వుప్పుడుబియ్యం తింటారు. ఈ దృష్ట్యా యిది గమనార్హం. ధాన్యాన్ని మిల్లు పట్టుటకు ముందు వుడకబెట్టినందువల్ల కొంత నష్టం తగ్గినా దంపుకున్నప్పటి కంటె మిల్లులో పోసినప్పుడు పౌష్టికాహారం విలువ తగ్గడం నిశ్చయం.

## కడుగుట

వంటకి ముందు బియ్యం కడుగుటలో కూడా కొంత పౌష్టికాహార పదార్థం పోతుంది. నీళ్ళు యెక్కువపోసి యెక్కువసార్లు కడిగినకొలదీ నష్టం హెచ్చుతుంది. అయితే ఆహార పదార్థాలలో అధిక భాగం మొదటిసారి కడిగినప్పుడే పోతాయి. గంజి వార్చడంవల్లకూడా ఆహార పదార్థం నష్టమవుతుంది. గంజిని త్రాగిగాని లేదా అన్నం వార్చకుండా అత్తిసరు పెట్టుకొని కాని యీ నష్టాన్ని నివారించుకోవచ్చు. బియ్యాన్ని అతిగా కడిగి, గంజి వార్చడంవల్ల బియ్యంలోగల సున్నం, భాస్వరం పదార్థాలలో 100కి 50 వంతులు, యినుముపదార్థంలో 100కి

75 వంతులు నష్టమౌతాయి. ఇందువల్ల విటమిన్ బి కూడా చాలభాగం నష్టమౌతుంది.

దంపుడుబియ్యం పరిశ్రమ అభివృద్ధికై ప్లానింగు కమిషన్ రెండు ముఖ్య మార్గాలను సిఫార్సుచేసింది. 1. కొన్ని పరిస్థితులలో తప్ప భారీ పరిశ్రమను యింకా విస్తరించుటకు అనుమతి యివ్వకూడదు. 2. ఎక్కువ పుష్టికరమయిన ఆహారం, వుద్యోగ కల్పనలదృష్ట్యా, హాల్లరురకం బియ్యంమిల్లులను క్రమేణా తొలగించి వాటి స్థానంలో దంపుడుబియ్యం పరిశ్రమను నెలకొల్పాలి. రాష్ట్ర ప్రభుత్వాలతో సమాలోచించి కేంద్రప్రభుత్వం సాధ్యమైనంతవరకూ యీ సిఫార్సులను అమలుపరచి దంపుడుబియ్యం పరిశ్రమను ప్రోత్సహించుటకై తగిన చర్య తీసుకున్నది.

## గ్రామీణులకు పని

ఆపైన యీ పరిశ్రమ గ్రామీణులకు యెక్కువ వుద్యోగావకాశాలను కల్పిస్తుంది. ప్రస్తుత అంచనాల ప్రకారం బియ్యంచేసే ధాన్యంలో 100 కి 60 వంతులు దంపబడుతున్నది. బియ్యం చేయుటకు 200 లక్షల టన్నుల బియ్యం లభిస్తాయన్న ప్రాతిపదికపై దంపుడుబియ్యం పరిశ్రమలో రమారమి 120 లక్షల టన్నులు వుంటాయి. సంవత్సరంలో 6 నెలలు పనిచేస్తూ ఒక్కొక్క మనిషి 2 టన్నుల బియ్యాన్ని తయారుచేస్తున్నారనుకుంటే, పై ధాన్యం రమారమి 60 లక్షల మందికి పని చూపిస్తున్నాయి. అయితే యీ ధాన్యంలో చాలభాగం కార్మిక వృత్తి పనివారిచేగాక వినియోగదారుల చేతనే యింట్లో స్వయంగా దంపుకొనబడుతున్నాయి. అయినప్పటికీ యిందువల్ల ప్రస్తుతం యీ పరిశ్రమ యెందరికి లాభకరమయిన వృత్తిని కల్పిస్తున్నదో తెలుస్తుంది. కేవలం బియ్యం దంపుతో జీవించేవారు కూడా 1951లో 2 లక్షలమంది పనిచేసినట్టు అంచనా వేయబడింది. పూర్తిగా ధాన్యమున్నీ దంపబడినట్లయితే పై ప్రాతిపదికపైనే మరొక 40 లక్షల మందికి పని దొరుకుతుంది. బియ్యం దంపేవారికి దంపిన ప్రతి మణుగుకి రూ. 1-8-0 చొప్పున యిస్తే మొత్తం వేతనాల సొమ్ము రమారమి రూ. 50 కోట్లు కాగలదు. ఈ విధంగా యీ పరిశ్రమద్వారా తగినంత డబ్బు గ్రామీణులకి పంపకం కాగలదు.

ప్రస్తుతం మిల్లుల్లో పట్టబడే ధాన్యాన్ని దంపుకున్నట్లయితే గ్రామీణులకు పని, వేతనాలు లభించుటయేకాదు ఆహార ధాన్యాలలో స్వయం సమృద్ధికై చేసే కృషి త్వరగా ఫలిస్తుందికూడా. దంపువల్ల 100 కి సగటున 3 వంతుల బియ్యం యెక్కువ లభిస్తాయి. ఇందువల్ల అదనంగా 3.6 లక్షల టన్నుల బియ్యం లభిస్తాయి. ఇది యేటా దిగుమతిచేసుకునే బియ్యంలో తగినంత శాతం వుంటుంది. డబ్బు రూపంలో విదేశ మారకంలో యిందువల్ల రూ. 36 కోట్లు మిగులుతాయి.





కాకినాడ వైద్య కళాశాలను ప్రారంభిస్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రి

# కాకినాడ వైద్యకళాశాల

కాకినాడలో శ్రీరంగరాయ స్మారక వైద్య కళాశాలను 17-11-58 న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ప్రారంభించారు. ఈ కొత్త కళాశాల ప్రారంభానికై చాల రోజులుగా ప్రజలు మహోత్సాహంతో కృషి చేశారు ఈ కృషి కాకినాడ వైద్య విద్యా సంఘం యాజమాన్యాన జరిగింది ఈ ఆలోచన పుట్టు పూర్వోత్తరాలు, అది పెంపొందిన విధానాలనుగురించి, ఈ సంస్థ అభివృద్ధికిగల గొప్ప అవకాశాలనుగురించి యీ సంఘం డైరెక్టరు డా ఎమ్ వి కృష్ణారావు దాని ప్రారంభం సందర్భంలో ప్రకటిత మయిన సావెనీర్ లో వివరించారు. కాకినాడలో ప్రభుత్వ హెడ్ క్వార్టర్సు ఆస్పత్రి ప్రత్యేక శాఖలతో 10 యెకరాల విస్తీర్ణంగల ప్రదేశంలో నెలకొని వున్నదనీ, దాని మంచాల అధికారిక సంఖ్య 400 అనీ, యీ ప్రణాళికాకాలంలో మరి 8 1/2 యెకరాల సేకరణతో అది విస్తరింపచేయబడుతున్నదనీ, త్వరలో దానిని బోధనా ఆస్పత్రిగా పెంపొందించవచ్చుననీ, పోస్టు ఎగ్జామినేషన్ ఇంటర్నీల శిక్షణ నిమిత్తము, ప్రాంతీయ ఆరోగ్య లేబొరేటరీ స్థాపన నిమిత్తము అభివృద్ధి పరచబడుటకై ప్రభుత్వంచే అది యెన్నబడినదనీ యీ కారణాలన్నిటిని పురస్కరించుకొని యీ కళాశాలను కాకినాడలో నెలకొల్పుటకు నిర్ణయించబడినదనీ ఆయన అన్నారు.

"ఆంధ్రప్రదేశ్ లో కాకినాడ ఆస్పత్రితో సరితూగగల జిల్లా ముఖ్యపట్నం ఆస్పత్రిలేదు ఈ పరిస్థితులలో ప్రైవేటు వ్యక్తుల యాజమాన్యాన వైద్య విద్య అభివృద్ధికి తగినతోడ్పాటును యివ్వనీ, బోధనా ప్రయోజనాలకై కాకినాడ ఆస్పత్రిని అభివృద్ధిపరచి విశ్వవిద్యాలయం అవసరాలను తీర్చ

మనీ, విద్యార్థుల క్లినికల్ బోధనకు ఆస్పత్రిని అందుబాటులోకి తెమ్మనీ ప్రభుత్వాన్ని కోరడం జరిగింది".

## సంఘం పుట్టుపూర్వోత్తరాలు

"కాకినాడ వైద్య కళాశాల సంఘం" అనే ప్రారంభ తాత్కాలిక సంఘం 16-4-58 న కాకినాడ "వైద్య విద్యా సంఘాన్ని" రిజిస్టరు చేసింది. వైద్య విద్య, వైద్య పరిశోధన వైద్య సహాయాలకు దోహదం చేయుట దీని సాధారణ ఆశయం. 1958 జూలై నాటికి కాకినాడలో వైద్య కళాశాలను యేర్పాటుచేయుట ప్రత్యేకాశయం. ఈ సంఘంలో (1) వైద్యులు (2) ఒక్కసారిరూ. 20,000కి మించి విరాళమిచ్చేవ్యక్తులు (3) ప్రముఖులనుంచి సంఘంచే అప్పుడప్పుడు యేన్నుకొనబడే గౌరవ సభ్యులు (4) స్థానిక శాసన సభ్యులు, పా. స., పుర పాలక సంఘం అధ్యక్షుడు; జిల్లా బోర్డు అధ్యక్షుడు ఎక్స్ అఫీషియోలకి మాత్రమే సభ్యత్వం వుంటుంది."

## ప్రభుత్వ సహకారం

ఈ ప్రయత్నానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రోత్సాహం లభించినది. వైద్యకళాశాల ప్రీ-క్లినికల్ విభాగానికి తాత్కాలిక వసతి సంపాదనలో యీ సంఘానికి సహాయం లభించింది. వైద్యశాఖ డైరెక్టరు యీ పథకం పట్ల చాలశ్రద్ధతీసుకున్నారు. రాష్ట్ర వైద్య కళాశాలల ప్రిన్సిపాలులు, ఆ యీ శాఖల ప్రొఫెసర్లు యీ సంఘానికి విలువయిన సలహా యిచ్చి తోడ్పడ్డారు.

## పథకం అభివృద్ధి

కాకినాడ వైద్య కళాశాల పథకం ఆభివృద్ధికిగల అవకాశం వివరాలు (1) స్థలం (2) భవనాలు, సాధన సంపత్తి (3) డబ్బులను పురస్కరించుకొని దిగువ తెలియ జేయబడినవి.

## స్థలం

వైద్య కళాశాల ప్రీ-క్లినికల్ విభాగాన్ని నెల కొల్పుటకై ప్రభుత్వ విద్యా శాఖ శరణాలయం భవనాలను ఖాళీచేసింది. ఆ భవనాలు, స్థలం యీ సంఘానికి యివ్వబడినవి. పిఠాపురం రోడ్డు పశ్చిమాన గల శరణాలయం భవనాలు 11-1/2 యెకరాలు విస్తీర్ణంగల ప్రదేశంలో వున్నాయి. ఈ రోడ్డుకి తూర్పున 19 యెకరాల స్థలం వుంది. అక్కడ వారికే అనగా పిఠాపురం మహారాజా వారికే చెందిన కొన్ని యిళ్లున్నాయి. ప్రస్తుతం ఆ భవనాలు, స్థలం అన్నీకూడా కౌలుకి తీసుకొనబడ్డాయి.

"అయితే జనరల్ హెడ్‌క్వార్టర్సు ఆస్పత్రికి యెదుట 36 యెకరాల విస్తీర్ణంగల పి. ఆర్. కళాశాలా ఆవరణలో 12 యెకరాల స్థలాన్ని ప్రభుత్వం యివ్వగలిగినట్లయితే, అది కళాశాలకి ఆదర్శ ప్రాయ మయిన స్థలంగా వుండగలదని భావించబడింది, అప్పుడు శరణాలయ భవనాలు, పిఠాపురం రోడ్డుకి యిరుపక్కలాగల స్థలంకూడా వసతిగృహాలు, సిబ్బంది గృహాలు, ఆటస్థలాలకు వుపయోగించబడతాయి."

## భవనాలు, సాధనసంపత్తి

అభివృద్ధిని క్రమఘట్టాలలో సాధించాలని సంకల్పించబడింది. తొలిఘట్టంలో వైద్య కళాశాల ప్రీక్లినికల్ విభాగం అనగా శారీరశాస్త్ర, జంతు దేహధర్మశాస్త్ర, జీవరసాయనశాస్త్ర, రసాయన శాస్త్ర శాఖలు తాత్కాలికంగా శరణాలయ భవనాలలో యేర్పాటుచేయబడినవి.

నిర్మాణంలో అవసరమయిన మార్పులు చేయబడినవి (1) ప్రధాన భవనాల పొడుగునా లెక్చర్ హాలు, జంతుదేహ ధర్మశాస్త్ర ప్రదర్శన హాలు నిర్మించబడినవి. (2) మధ్య భవనం డాబాపై అంగచ్ఛేదం హాలు. (3) పారిశుద్ధ్య యేర్పాట్లు, నీటి సరఫరా (4) విద్యుచ్ఛక్తి. ఇందుకు సంబంధించిన పని పూర్తి అయింది. ఈ భవనాలు వైద్య విద్య మొదటి 1-1/2-2 సంవత్సరాలకు సరిపోగలవని భావించబడుతున్నది.

ప్రీక్లినికల్ సబ్జక్టుకి అవసరమయిన లేబొరేటరి సాధన సంపత్తి, పరికారాలు రూ. 4 లక్షల ఖరీదు గలవి వచ్చాయి.

## రెండవ ఘట్టం

రెండవ ఘట్టంలో వైద్య కళాశాల శాశ్వత భవనాలను గుంటూరు వైద్య కళాశాలనమూనాలో, వాంఛనీయమనితోచిన మార్పులు, చేర్పులతో నిర్మించాలని సంకల్పించబడింది. ఈ భవనాలలో రోగ లక్షణశాస్త్రం, సూక్ష్మ క్రిమిశాస్త్రం, ఔషధకరణ శాస్త్రం, ఫారెన్‌సిక్ మెడిసిన్, నిరోధ, సాంఘిక వైద్యం, ప్రయోగాత్మకశస్త్ర చికిత్సలెక్చర్ థియేటర్లు మున్నగు నాన్ క్లినికల్ లేబొరేటరీ సబ్జెక్టులకేకాక యితర క్లినికల్, ప్రీక్లినికల్ విషయాలకుకూడా వసతి వుంటుంది. మొత్తం కళాశాల పైనచెప్పిన ప్రత్యామ్నాయ స్థలం లభించుటనుబట్టి సాధ్యమయినంతవరకూ ఒకే స్థలంలో ఆస్పత్రికి సాధ్యమయినంత దగ్గరలో వుంటుంది. శాశ్వత భవనాల నిర్మాణం 1959 ప్రారంభదశలో ప్రారంభింప బడగలదని ఆశించబడుతున్నది.

ఈ భవననిర్మాణ కార్యక్రమానికి రూ. 15-20 లక్షలు ఖర్చు కాగలవని భావించబడుతున్నది.

రెండవ ఘట్టంలో సాధన సంపత్తికి (ప్రీక్లినికల్ విషయాలు మినహా) రూ. 6 లక్షలు కావచ్చునని భావించబడుతున్నది. ఈ విధంగా కళాశాలాపరంగా మళ్ళీమళ్ళీ కాని మొత్తం ఖర్చుక్రింద భవనాలకు రూ. 15-20 లక్షలు, సాధన సంపత్తికి రూ. 10 లక్షలవరకూ ఖర్చు కాగలదు.

కళాశాలను పూర్తిగా ప్రజలనుంచి సేకరించిన విరాళాలనుంచి నిర్మించాలని ఆశయం. సంవత్సరానికి 100 మంది విద్యార్థులను చేర్చుకోవాలనీ, యిందు నిమిత్తం అవసరమయిన స్థలాలు, భవనాలు, పరికరాలు, సిబ్బందిని సమకూర్చాలనీ సంకల్పించబడింది.

వసతిగృహాలు ప్రస్తుతం అద్దెభవనాలలో నడుస్తున్నాయి.

కాకినాడ పురపాలకసంఘం యేటా రూ. 25,000 చొప్పున నాలుగు సంవత్సరాలలో ఒక లక్ష రూపాయలను యిచ్చుటకు తీర్మానించింది.

జిల్లా క్షయ సంఘం ఆస్పత్రికి, ఓ. పి. శాఖను (క్షయక్లినిక్కుతో సహా) మార్చి కట్టి, వెంటనే క్లినికల్ తరగతులకుపయోగించుటకై రూ. 1,20,000 యిచ్చింది.

కాకినాడ పురపాలక సంఘం అధ్యక్షుడు శ్రీ డి. భాస్కరరావు బహుమతుల ప్రదానానికై రూ. 10,000 విరాళమిచ్చారు.

శా. స స. శ్రీ ముళ్లపూడి హరిశ్చంద్రప్రసాద్ తణుకు, ముళ్లపూడి వెంకట్రాయుడు స్మారకవిద్యా ట్రస్టునుంచి యీ వైద్య కళాశాలకు రూ. 5 లక్షల భూరి విరాళం యిచ్చారు.

ఆపైన దిగువ పద్ధతిలో నిధి వసూలు కార్యక్రమం యేర్పాటు చేయబడింది.

భూరి విరాళాలు కాక యీ సంఘం ఒక్కొక్క దాతనుంచి కనీసం రూ. 1000 వసూలు చేయుట ప్రారంభించింది. మా లక్షణలక్ష్యం రూ. 5,00,000. దాదాపు ఈ సొమ్ము అంతా వసూలు చేయబడింది.

ఈ నిధి రిజర్వునిధిగా వుండి అత్యవసర సమయాలలో ఖర్చుకి, అభివృద్ధికి వుపయోగించగలదని భావించబడుతున్నది.

100 మంది విద్యార్థులను చేర్చుకొనుటకు తగిన వసతి అధునాతన లేబొరేటరీ పరికరాలను సమకూర్చుటకు అనువుగా వైద్య విద్యా సంఘం ప్రజల నుంచి విరాళాలను సేకరిస్తున్నది. ఒక్కొక్కరు రూ. 6000 తక్కువ కాకుండా విరాళాలివ్వాలని విజ్ఞప్తి చేయబడింది. ఇది పరికరాలు, భవనాలపరంగా ఖర్చు పెట్టబడుతుంది. ఒక్కొక్క దాత కళాశాలలో చేర్చుకొనుటకై ఒక్కొక్క విద్యార్థిని సిఫార్సు చేయవచ్చు. విద్యార్థుల యోగ్యత, ఆటలు, ఎన్. సి. సి., స్కౌటింగు మున్నగు యితర విషయాలలో గణించిన పేరుల ప్రాతిపదికపై అభ్యర్థులను యెన్నుకొనే హక్కు వైద్య విద్యా సంఘానికి వుంటుంది. ఈ యెన్నిక విషయంలో యీ సంఘం నిర్ణయమే తుది నిర్ణయం. విరాళమిచ్చినంత మాత్రాన యీ కళాశాలలో చేరుటకై యెవరినీ యెన్నటం జరుగదు.

ఈ విరాళాలు అభివృద్ధి ప్రారంభదశలలో మొదటి 5-10 సంవత్సరాలలో యేడాదికి రూ. 6

లక్షల చొప్పున అందగలవని భావించబడుతున్నది. మొదటి 5 సంవత్సరాలలోను రూ. 301 లక్షలు అందగలవని భావించబడుతున్నది.

ప్రతియేటా శేషంలో యించుమించు 50 % పరికరాలకి, 50% భవనాలకి కేటాయించబడుతుంది. ఆ విధంగా పరికరాలక్రింద రూ. 10 (రూ. 4 లక్షలు ప్రీ క్లినికల్, రూ. 6 లక్షలు నాన్ క్లినికల్ సబ్జక్టులు) లక్షలు, భవనాలక్రింద రూ. 15 లక్షలు ఖర్చు కాగా రూ. 5 లక్షలు రిజర్వునిధిగా వుండుటకు వీలుకలుగుతుంది.

5 సంవత్సరాల తరువాత కళాశాలా భవనాలు పూర్తిఅయి, సాధనసంపత్తి పూర్తిగా చేరినమీదట పరిస్థితిని సమీక్షించి అవసరమయితే విరాళాల సేకరణను యింకా కొనసాగించవచ్చు. వసతిగృహాలు, నివాసగృహాలు మున్నగువాటి నిర్మాణం పధకం మరి 5 సంవత్సరాల కాలంలోనూ చేపట్టబడుతుంది. అప్పుడు శాఖల అభివృద్ధికి, పోస్టుగ్రాడ్యుయేటు చదువుకి, పరిశోధనకి రూ. 10-15 లక్షలు విడిగా కేటాయించబడతాయి.

ఈ పధకంక్రింద యీ సంఘానికి అప్పుడే రూ. 16 లక్షలు వచ్చాయి.

లోతక్కువలు యేమైనా వస్తే భర్తీ చేసుకోడానికై యీ ప్రణాళికా కాలంలోను, తృతీయ ప్రణాళికా కాలంలోనూ కూడా సహాయం చేయమని కేంద్రప్రభుత్వాన్ని కోరాలని కూడా సంకల్పించబడింది. భవనాలు, సాధన సంపత్తిల నిమిత్తం 50% గ్రాంటులను యిమ్మని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరాలని కూడా సంకల్పించబడింది.

## నెలసరి ఖర్చు

కళాశాల రుసుం యేడాదికి రూ. 1000. రుసుం రాబడి మొదటి సంవత్సరంలో రూ. 1 లక్ష, రెండవ సంవత్సరంలో రూ. 2 లక్షలు, మూడవ సంవత్సరంలో రూ. 2-3/4 లక్షలు వుంటుంది. 5వ సంవత్సరం నుంచి అది రూ. 5 లక్షలకి పెరుగుతుంది. బోధనా సిబ్బంది, తదితర సిబ్బంది జీతాలు, కళాశాలాపరంగా జరిగే యితర నెలసరి ఖర్చులలో చాలభాగానికి పై రుసుం రాబడి వుపకరిస్తుంది.

## బోధనా సిబ్బంది

బోధనా సిబ్బంది విషయంలో, దేశమంతటా యీ సిబ్బంది కొరతవల్ల చిక్కుగా వున్నదని యీ సంఘం పూర్తిగా గుర్తించింది. అయినప్పటికీ అనుభవజ్ఞులు, అర్హులు అయిన వుపాధ్యాయులను సంపాదించాలని అది మనస్ఫూర్తిగా వుద్దేశిస్తున్నది. అనుభవజ్ఞులయిన సీనియర్ వుపాధ్యాయులను, ప్రాక్టీసులేకుండా పూర్తికాలం బోధనా వ్యాసంగం గల ముఖ్యంగా ప్రీక్లినికల్ సబ్జక్టు, నాన్ క్లినికల్ లేబొరేటరీ సబ్జక్టులో ప్రతిభావంతులయిన యువకులనుకూడా ఆకర్షించుటకై యీ సంఘం అన్ని తరగతుల బోధనా పదవులకు యితర చోట్లకంటె యెక్కువ జీతాలను ప్రకటించింది.

## కాకినాడ ప్రభుత్వ ఆస్పత్రి

కాకినాడ ప్రభుత్వ హెడ్ క్వార్టర్సు ఆస్పత్రిని బోధనా ప్రయోజనాలకై జనరల్ ఆస్పత్రిగా అభివృద్ధిపరచుటకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించింది. ఈ ఆస్పత్రిలో మంచాల అధికారిక సంఖ్య 400.

ఈ ఆస్పత్రి అభివృద్ధికై, యితర అభివృద్ధులతో పాటు దిగువవాటిని నిర్మించవలసి వుంటుంది. మొదటి తరగతి ఔట్ పేషెంటుశాఖ, క్లినికల్ లెక్చర్ థియేటరు, మార్చ్యుయరీ, పురిటిగదులు కలిగి 100 మంచాలు పట్టే ప్రసూతి, స్త్రీ విజ్ఞాన విషయిక బ్లాకు, స్తనసంబంధమయిన ఆపరేషన్ థియేటర్లు. ఈ అభివృద్ధి పనులలో పెద్దవి తృతీయ ప్రణాళిక కాలంలో అమలుపరచాలని వుద్దేశించబడినవి. ద్వితీయ ప్రణాళిక కాలంలో ఔట్ పేషెంటు శాఖను పునర్నిర్మించి, గుడిసెల వసతిని సమకూర్చాలని తలపెట్టబడింది.

కళాశాల క్లినికల్ శాఖలలో సిబ్బందిలో సీనియర్ సభ్యులకు అనగా ప్రొఫెసర్లు, రీడర్లు, లెక్చరర్లకి జీతాలను కళాశాల యిస్తుంది. వీరు కళాశాలా సిబ్బందిలో పూర్తికాలం పనిచేసేవారుగాను, ఆస్పత్రిలో గౌరవ వైద్యాధికారులుగాను వుంటారు.

సహాయకుల విషయంలో, ఆస్పత్రిని ప్రభుత్వం నడుపుతున్నది కనుక, ప్రతిశాఖకు అధమం ఒక సహాయకుని ప్రభుత్వం నియమిస్తుందని భావించబడుతున్నది. కళాశాలవారికి బోధనాభత్యాన్ని చెల్లిస్తుంది.

ఇదికాక, ఆస్పత్రిలో గౌరవ సహాయ వైద్యాధికారులుగా పనిచేస్తున్న సగంకాలం వైద్యాధికారులు కళాశాలా సిబ్బందిలో వుండి కళాశాలలో బోధించినందుకై అనరోరియంను పొందుతారు. ఆపైన ప్రతి పెద్దశాఖకి అనగా వైద్యం, శస్త్రచికిత్స, మంత్రసానిపని శాఖలకి కళాశాలా సిబ్బందిలో పూర్తికాలం పనిచేసే రిజిస్ట్రారు వుంటాడు.

జీవరసాయనశాస్త్ర, రోగలక్షణశాస్త్ర, సూక్ష్మ క్రిమిశాస్త్రాలకు చెందిన కళాశాలా లేబొరేటరీలు ఆస్పత్రిలోని క్లినికల్ లేబొరేటరీ ప్రభుత్వ ఆస్పత్రి నిమిత్తం లేబొరేటరీ పరిశోధనను చేపట్టగలవు. పరిశోధనలుకూడా బోధనలో ఒకభాగం కావడమే యిందుకు కారణం.

ఆస్పత్రి అభివద్ధి, అందుకు సంబంధించిన కళాశాలలోని లేబొరేటరీల అభివృద్ధితో వుభయగోదావరులు, ఆ చుట్టుపట్ల ప్రదేశాలలోని రమారమీ 50 లక్షల మందికి నిపుణవైజ్ఞానిక వైద్య సహాయం అందుబాటు కాగలదు.

కాకినాడ కు విద్యాకేంద్రంగా వున్నతమయిన సాంప్రదాయం కలదు. మిక్కిలి పెద్ద మొదటి తరగతి కళాశాలల్లో ఒకటి అయిన ప్రభుత్వ పిఠాపురం రాజా కళాశాల, ప్రభుత్వ ఇంజనీరింగు కళాశాల, కాకినాడ పాలీటెక్నిక్ సంస్థ, పారిశ్రామిక శిక్షణాకేంద్రం అక్కడ వున్నాయి. అక్కడికి 40 మైళ్ళలోపు దూరంలో రాజమండ్రిలో వుపాధ్యాయుల కళాశాల, చాలా పెద్ద మొదటి తరగతి కళాశాలా వున్నాయి. అంతర్ కళాశాలా కార్యకలాపాలకు, ఎన్. సి. సి. వంటి యితర కార్యకలాపాలకు యెంతో అవకాశమున్నది.

కాకినాడ జనాభా 1-1/2 లక్షలకి మించి వుంటుంది. ఆ ఆస్పత్రి వుభయ గోదావరి జిల్లాలకి వుపకరిస్తున్నది. తూర్పు, పశ్చిమగోదావరి జిల్లాలు ఆంధ్రప్రదేశ్ ధాన్యాగారం; కోనసీమ ఆరామసీమ. కాకినాడ నగరం యీ ప్రాంతాల ముఖద్వారం వద్ద వున్నది. కాబట్టి ఆంధ్ర పట్నాలన్నిటిలో కంటె యిక్కడ ఆహార పదార్థాల ధర మిక్కిలి సరసంగా వుంటుంది. సర్వసాధారణంగా తక్కువ డబ్బుతో జీవించవచ్చు.

కాకినాడ లో చక్కని నీటి సరఫరా పద్ధతి వున్నది. సముద్రతీర ప్రదేశంగా దాని శీతోష్ణస్థితి ఆరోగ్యకరమయినది. అది జిల్లా ముఖ్యపట్నంగా వుంది. అక్కడి మునిసిపాలిటీ ఆంధ్రప్రదేశ్ లో వుత్తమోత్తమ మునిసిపాలిటీలలో ఒకటి.

కాబట్టి కొత్త వైద్య కళాశాల స్థాపనకి కాకినాడ ఆ దర్శప్రాయమైన స్థలం. దీనికి గోదావరి జిల్లాల ప్రజలు పూర్తిగా దోహదంచేసి, పెంపొందించవచ్చు.

శ్రీ ఎమ్. హరిశ్చంద్రప్రసాద్ భూరి విరాళానికి కృతజ్ఞతా సూచకంగా వైద్య విద్యా సంఘం యీ కళాశాలకి "శ్రీరంగరాయ స్మారక వైద్య కళాశాల" అని పేరుపెట్టింది.



# ప్రశ్నోత్తరావళి

ప్రశ్న 88 : (శ్రీ వి. పరబ్రహ్మం, దావలూరు, తెనాలి తాలూకా)

పచ్చనాణెములు యెప్పటినుంచి చలామణి కావు? ఎందువల్ల ?

జవాబు : పసుపుపచ్చ నికెల్-ఇత్తడి బేడకాసులు 1-1-59 నుంచి చలామణికావు. అయితే అవి ప్రజలనుంచి 30-6-1959 వరకూ ఇండియా రిజర్వుబ్యాంకు అన్ని కార్యాలయాలలోను, ప్రభుత్వ వ్యవహారాలను చూస్తున్న రిజర్వు బ్యాంకు ఏజన్సీబ్యాంకులన్నిటిలోను, ప్రభుత్వ ట్రెజరీలు, సబ్-ట్రెజరీ లన్నిటిలోను పుచ్చుకోబడతాయి. అంతేకాక మళ్లీ ప్రకటన చేయబడే వరకూ అవి బొంబాయి, కలకత్తా, మద్రాసు, కాన్పూరు, న్యూఢిల్లీ, బెంగుళూరు, నాగపూరు లలో ఇండియా రిజర్వుబ్యాంకు ఇస్యూశాఖచే అంగీకరించబడతాయి.

పసుపుపచ్చ నికెల్-యిత్తడి బేడకాసులవంటివి దేశంలో కొన్నిచోట్ల దొంగనాణెములు వుంటున్నాయి. అందువల్ల వాటిని వుపసంహరించి ఆ విధంగా ప్రజలు మంచి నాణెములు, చెడ్డ నాణెముల మధ్య తేడా తెలియక పడే చిక్కులను తొలగించుటకై యీ చర్య గైకొనబడింది.

ప్రశ్న 89 : (శ్రీ సి హెచ్. విఠల్, రామాయంపేట) ఆంధ్రప్రదేశ్ లో బ్లాకు అభివృద్ధి కార్యాలయాలు యెన్ని వున్నాయి ?

జవాబు : పి. ఇ. ఓ. ల అధ్వర్యాన నడిచే బహుళార్థ సాధక బ్లాకులు 4 వున్నాయి. బ్లాకు అభివృద్ధి అధికారుల అధ్వర్యాన నడిచేవి యివి : సమాజాభివృద్ధి కేంద్రాలు 38 ; మొదటి అంచె బ్లాకులు 130 ; రెండవ అంచె బ్లాకులు 45 ; ఇవికాక 5 పూర్వ-విస్తరణ కేంద్రాలుకూడా వున్నాయి.

ప్రశ్న 90: (శ్రీమతి పి. రామలక్ష్మి, దోణుకంట పి. ఓ., ఆర్మూరు తాలూకా)

ఆంధ్రప్రదేశ్ లో యేటా యెంత రెవిన్యూ వసూలు చేయబడుతుంది ? ఆంధ్ర ప్రాంతం యెక్కువ చెల్లిస్తుందా లేక తెలంగాణా యెక్కువ చెల్లిస్తుందా ?

జవాబు: 1957-58 లో మన రాష్ట్రంలో బకాయిలు, ప్రస్తుతానివి కలిపి మొత్తం రూ. 11,66,37,622 భూమిశిస్తు వసూలయింది. ఆంధ్రప్రాంతం తెలంగాణా ప్రాంతం చెల్లించేదానికంటె రెట్టింపు కంటే యెక్కువ చెల్లిస్తుంది. ఆంధ్ర జిల్లాల్లో వసూలయిన సొమ్ము రూ. 8,20,58,069, తెలంగాణాలో వసూలయిన సొమ్ము రూ. 3,45,79,553.

ప్రశ్న 91 : (శ్రీహరి సత్యనారాయణ, ఎర్రుపాలెం, మధిర తాలూకా)

ఆంధ్రప్రదేశ్ లో మిక్కిలి పెద్ద తాలూకా యేది? అది యెక్కడవున్నది ? దాని జనసంఖ్య యెంత?

జవాబు : విస్తీర్ణంలో, విశాఖపట్నం జిల్లాలోని గూడెం తాలూకా ఆంధ్రప్రదేశ్ తాలూకాలలోకెల్లా మిక్కిలి పెద్దవి. దాని విస్తీర్ణం 1869 చ. మైళ్లు; జనసంఖ్య 109521.

అయితే జనసంఖ్య దృష్ట్యా, పశ్చిమ హైదరాబాదు తాలూకా మిక్కిలి పెద్దది. దాని జనసంఖ్య 11,66,860. దాని విస్తీర్ణం 277.12 చ. మైళ్లు మాత్రమే.

ప్రశ్న 92 : మెట్రిక్ తూకములలో ప్రజలు జ్ఞాపకం పెట్టుకోవలసిన మామూలు యూనిట్లు యేవి ? షాపులలో వాటిని గుర్తించటమెలాగ ?

జవాబు : తూకములలో ప్రతివారు జ్ఞాపకం పెట్టుకొనవలసిన మామూలు యూనిట్లు కిలోగ్రాము,

గ్రాము అయివున్నాయి. వాటి ఆకారాలు, పరిమాణాలనుబట్టి వాటిని గుర్తించవచ్చు. ఈ తూకం రాళ్లు షడ్భుజాకారంగా వుంటాయి. వాటి తూకం వివరాలు వాటి పైభాగంలో వుంటాయి. సులభంగా గుర్తించుటకు వీలుగా అవి షడ్భుజాకారంగా వుండాలని ప్రభుత్వం నిర్ణయించింది.

ప్రశ్న 93 : (శ్రీ సి. లక్ష్మీనారాయణప్రసాద్, నందిగామ, కృష్ణా జిల్లా)
ఇండియా రక్షణ వ్యవస్థతో సంబంధంగల ప్రధాన సంస్థలేవి ?

జవాబు : రక్షణ వ్యవహారాల విధానానికి సంబంధించిన అన్ని విషయాలలోను నిర్ణయాలు తీసుకుని వాటి అమలుకి బాధ్యతవహించే రక్షణ మంత్రిత్వశాఖ సాయుధబలాల హెడ్ క్వార్టర్సు ద్వారా తన కార్య నిర్వాహక బాధ్యతను నిర్వహిస్తుంది. పై హెడ్ క్వార్టర్సులో సైనిక, నౌకా, వైమానిక హెడ్ క్వార్టర్సు వుంటాయి. ఆపైన, ఆర్డినెన్సు ఫ్యాక్టరీల డైరెక్టరేటు జనరల్, రక్షణ శాస్త్ర సంస్థ, నేషనల్ కేడెట్ కోర్, మిలిటరీ భూములు, కంటోన్మెంటుల డైరెక్టరేటు, చారిత్రక విభాగం, సాయుధబలాల సమాచార కార్యాలయంవంటి ఇంటర్ సర్వీసు సంస్థలన్నిటి పరిపాలనలో దానికి యెక్కువ ప్రత్యక్ష బాధ్యత వుంటుంది. రక్షణ పరిశ్రమల విషయంలో జరిగే పరిశోధన, అభివృద్ధులను సరిగా సమన్వయపరచుటకై రక్షణ వుత్పత్తి సంఘం వున్నది.






21-12-58న రాష్ట్ర ముఖ్యమంత్రి నిజామాబాదుజిల్లా బోధన్‌లో ప్రభుత్వ వున్నతపాఠశాల భవనాన్ని ప్రారంభించారు.

# జిల్లా వార్తలు

## ఆదిలాబాదు

22-12-58న ఆదిలాబాదులో ద్వితీయ జిల్లా స్థాయి గోష్ఠిని ప్రారంభిస్తూ సమాజాభివృద్ధి కార్యక్రమం ఆరంభమయి ఆరు సంవత్సరాలు అయినదనీ ప్రణాళికలు, అభివృద్ధిశాఖామంత్రి శ్రీ వి. బి. రాజు అన్నారు. ఈ కాలంలో చాలపని జరిగినదని, ఇంకా జరుగవలసినది చాల వున్నదని అన్నారు.

ఆయన యింకా యిలాఅన్నారు: మన ఆర్థిక వ్యవస్థ అభివృద్ధిలో ప్రణాళికా రచన ప్రాముఖ్యం వహిస్తున్నది. ప్రతిఒక్కరూ ప్రణాళికా పరంగా ఆలోచించాలి. భారతదేశ సౌభాగ్యం ప్రధానంగా గ్రామీణ ఆర్థికవ్యవస్థ అభివృద్ధిపై ఆధారపడివుంది. గ్రామాభివృద్ధికి కొలతబద్ధ నిర్మితమయిన పాఠశాలలు లేక బావులసంఖ్య యెంతమాత్రంకాదు. దానికి కొలతబద్ధ సామాజిక జీవితనిర్మాణంలో సాధించిన ప్రగతిమాత్రమే.

పట్టణాలలో జనసంఖ్య హెచ్చుదలను గురించి మాట్లాడుతూ యిలా అన్నారు: గ్రామాలలో జీవనోపాదికి తగిన అవకాశాలు లేక పెక్కుమంది ప్రజలు ఆశయరహితంగా పట్టణాలకి తరలి వెడుతున్నారు. పట్టణాలకి తరలే యీకొత్తవారు సాంఘికవ్యవస్థలో సరిగా యిమడరు. ఆశయరహితమైన యీ తరలిపోకను అరికట్టాలి దీనిని అరికట్టి కొత్తసామాజిక జీవితాన్ని అభివృద్ధిపరచే ఆశయంతోనే సమాజాభివృద్ధి కార్యక్రమం ఆరంభించబడింది.

ఇటీవల ప్రవేశపెట్టిన పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల బిల్లునుగురించి ప్రస్తావిస్తూ యిలా అన్నారు: ప్రభుత్వం అధికార వికేంద్రీకరణ

సూత్రాన్ని జిల్లా స్థాయిలో అమలు పరుస్తున్నది. అధికారంతోపాటు బాధ్యతకూడా చేతులు మారింది. అధికారం, బాధ్యత కలిసివుంటాయి. ఎన్నికయిన ప్రజా ప్రతినిధులకు ప్రణాళికారచన, అభివృద్ధి రంగాలలో పూర్తి అవకాశాలను యిచ్చే వుద్దేశంతో ప్రభుత్వం యీ బిల్లును ప్రవేశపెట్టింది. ఈప్రయోగాన్ని ప్రథమంగా ఆంధ్రప్రదేశ్ జరుపుతున్నది. దీని ఫలితాలకై యావద్భారతదేశము ఆశతో యెదురు చూస్తున్నది.

మంత్రిగారు తమప్రసంగాన్ని ముగిస్తూ యిలా అన్నారు: అధికార యంత్రాంగం మార్గదర్శి, తత్వవేత్త దృక్పధాన్ని అలవరచుకొని ప్రజల ప్రజాస్వామిక సంస్థలకు తోడ్పడాలి. పథకాల అమలుతో కొందరు శాసించే పద్ధతికి స్వస్తిచెప్పడం మిక్కిలి ముఖ్యం.

రాష్ట్ర గవర్నరువంటి వ్యక్తి మారుమూలనున్న ఆదిలాబాదు జిల్లాను యెప్పుడూ దర్శించనందున నవంబరు 12వ తేదీ ఆదిలాబాదు చరిత్రలో విశిష్టమయినది. దీపావళి 11 సాయంకాలంతో ఆఖరైనా ఆదిలాబాదుజిల్లా ప్రజలకి నవంబరు 16 వరకూ పండుగలాగే వుంది. సోన్ వంతెననుంచి ఆదిలాబాదు పట్టణంవరకూ, నిర్మల్‌నుంచి రేవోజీపేట వరకూ రోడ్డుపక్క ముఖ్య గ్రామాలలో ఆర్చిలు కట్టబడినవి. నిజామాబాదు, అదిలాబాదు జిల్లాల సరిహద్దుగానున్న సోన్ వంతెన మహావైభవంగా అలంకరించబడింది.

నవంబరు 13 వుదయం రాష్ట్రగవర్నరు శ్రీ భీమసేన్ సచార్ స్థానిక పత్రికా విలేకరులకు, అనధికారులకు దర్శనమిచ్చి మాట్లాడారు. న్యాయస్థానం హాలులో న్యాయవాదుల నుద్దేశించి, జిల్లా కలక్టరు కార్యాలయంలో జిల్లా వుద్యోగుల నుద్దేశించి ప్రసంగించారు. మధ్యాహ్నం సైన్సు కాలేజీని దర్శించి కాళాశాల సిబ్బంది, విద్యార్థులను, స్థానిక విద్యాసంస్థల వుపాధ్యాయులు, విద్యార్థులను వుద్దేశించి ప్రసంగించారు. 13 సాయంకాలం శ్రీమతి సచార్ మావల (ఆదిలాబాదు సమాజాభివృద్ధికేంద్రం) ను దర్శించి స్థానిక మహిళామండలీ యేర్పాటుచేసిన ప్రదర్శనను తనిఖీ చేశారు. మండలికి ఆమె రూ. 25 విరాళమిచ్చారు.

ఆతరువాత బహుళార్థ సాధక వున్నతపాఠశాల ఆవరణలో జరిగిన పెద్ద బహిరంగసభలో మాట్లాడుతూ గవర్నరు యిలాఅన్నారు: ఒక దేశబలం దాని సాయుధ బలాలలోకాక దాని నీతి, ఆధ్యాత్మిక బలాలలో వుంటుంది. భారతదేశానికి అణుబాంబులు, వుదజని బాంబులవంటి ఆధునిక ఆయుధాలు లేకపోయినా, అంతర్జాతీయరంగంలో దానికి వున్నతమయిన స్థానంవుంది. ప్రసంగాన్ని ముగిస్తూ ప్రజలు తమ ఆర్థికపరిస్థితిని అభివృద్ధిచేసుకొనుటకై కష్టించి పనిచేయాలన్నారు.

14 వుదయం గవర్నరు జిల్లాకలక్టరు, జిల్లా వుద్యోగులతోకలిసి వుట్నూరు (బహుళార్థసాధక ప్రాజెక్టు) వెళ్లి అక్కడ ప్రాజెక్టు సలహాసంఘం సభ్యులనుద్దేశించి మాట్లాడారు. ఆసందర్భంలో అక్కడచేరిన గిరిజనుల నుద్దేశించికూడా ఆయన మాట్లాడారు. అంతకుముందు ఆయన గ్రామీణ కళలు, వృత్తుల కేంద్రాన్ని, గిరిజన బాలుల వసతిగృహాన్ని దర్శించారు. 14 సాయంకాలం పండిత్ నెహ్రూ జన్మదినోత్సవం సందర్భంలో వైభవంగా పిల్లల విన్యాసం యేర్పాటు చేయబడింది. ఆసందర్భంలో ప్రసంగిస్తూ పిల్లలకు సరైన ఆహారంయిచ్చి, సరైన పద్ధతిలో పెంచాలని ఆయన తల్లిదండ్రుల నుద్బోధించారు. లక్సెట్టిపేట వున్నతపాఠశాల విద్యార్థులు ప్రదర్శించిన "మార్షల్ డ్రిల్లు", గోండు యువకులు చేసిన "గిరిజన నృత్యాన్ని" చూసి ఆయన ఆనందించారు. ఈ రెండు ప్రదర్శనలకి ఆయన రెండు బహుమతులను ప్రకటించారు.

15-11-58న గవర్నరు సతీసమేతులై నిర్మల్‌కి వెళ్లి అక్కడ అనధికారులను, స్థానిక వుద్యోగులను కలుసుకున్నారు. ఆయన నిర్మల్ పరిశ్రమలను సందర్శించి దేశప్రసిద్ధమయిన నిర్మల్ చేతిపనులను ప్రశంసించారు. కడంకు వెడుతూ మధ్యతోవలో ఆయన పెక్కు ప్రదేశాలలో ఆగారు. ఆయా

ప్రదేశాలలో ప్రజలు వేలసంఖ్యలో గుమిగూడి ఆయనకు స్వాగతం చెప్పారు. 15 సాయంకాలం ఆయన సతీసమేతులై వెళ్లి సెప్టెంబరులో వుధృతమయిన వరదలకు గండిపడిన కడం ఆనకట్టను తనిఖీ చేశారు. అంతకుముందు శ్రీమతి లలితాసచార్ స్థానిక మహిళామండలిని దర్శించి, సభ్యులుచేసిన వస్తువులతో కూడిన ప్రదర్శనను తిలకించారు.

నవంబరు 16 రేవోజీపేట (ఖానాపురం) ప్రజలకి పర్వదినం. గవర్నరు స్వాగతానికై యీ ఆదర్శగ్రామం (రేవోజీపేట) కన్నుల పండువుగా అలంకరించబడింది. ఈ సందర్భంలో ఒక చక్కని పందిరివేయబడింది. స్థానిక అనధికారులు గ్రామం సరిహద్దులలో గవర్నరుకి స్వాగతం చెప్పారు. తరువాత ఆయనకి గ్రామం చూపించబడింది. ఆయన కొన్ని గిరిజన గృహాలను చూశారు. ఆయన ప్రజల కష్టనిష్టురాలను గురించి అడిగారు. ఆప్రాంతం ప్రజలకు యేమీ దురలవాట్లు లేవనీ, వారు కష్టపడి పనిచేస్తారనీ తెలుసుకొనుటకు ఆనందంగా వున్నదని ఆయన ఒక పెద్దసభలో ప్రసంగిస్తూ అన్నారు. స్త్రీలకు వుపవృత్తిని చూపగల మహిళామండలిని యేర్పాటు చేయమని ఆయన వారికి సలహాయిచ్చారు.

ఆతరువాత మధ్యాహ్నం ఆయన కడంనుంచి నిర్మల్ మీదుగా హైదరాబాదుకి బయలుదేరారు.

## అనంతపురం

వెంకటరెడ్డిపల్లి, హెచ్/ఓ. పెనుకొండలో 23-11-58 నుంచి 25-11-58 వరకూ గ్రామనాయకుల శిక్షణాశిబిరం జరిగింది. 41 మంది గ్రామనాయకులకు శిక్షణ యివ్వబడింది. ఆఖరురోజున అనగా 25-11-58 న వుత్సవానికి జిల్లా సహాయ కలక్టరు అధ్యక్షత వహించారు. జిల్లా మునసబు సమాజాభివృద్ధి కార్యక్రమం ఆశయాలను, శిబిర నిర్వహణ అగత్యాన్ని గురించి గ్రామనాయకులకు వివరించారు. శిక్షణ ముగిసినపిమ్మట శిక్షణలో నేర్చుకున్న విషయాలను అమలుపరుచుటకై గట్టిగా కృషి చేయాలని ఆయన వారికి సలహాయిచ్చారు.

30-11-58 న కురుబవాండ్లపల్లి, హెచ్/ఓ. ఎర్రమంచిలో హరిజన్ డే జరుపబడింది. ఉత్సవానికి జిల్లా సహాయ కలక్టరు అధ్యక్షత వహించారు. ఇంచుమించు రూ. 90 ఖరీదుచేసే బట్టలు హరిజనులకి పంచబడినవి.

కుదైర్ కేంద్రం: ప్రసన్నాయపల్లి గ్రామంలో డిసెంబరు 7 న అనంతపురం మునిసిపాలిటీ అధ్యక్షులు శ్రీ ఎమ్. సుబ్బయ్యచే స్థానిక గ్రామీణ బహుళార్థ సాధక పరపతి సంఘం ఆధ్వర్యాన పాల సరఫరా కేంద్రం ప్రారంభింపబడింది.

శింగనమలకేంద్రం: అనంతపురం జిల్లా కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘంయొక్క సింగనమల బహుళార్థ సాధకకేంద్రం ద్వితీయ వార్షికోత్సవం డిసెంబరు 7 న జరుపబడింది. ఉత్సవానికి శ్రీ ఎస్. యాగాంతి, ఐ. ఏ. ఎస్., (రిటైర్డు) అధ్యక్షత వహించారు.

ఆ సందర్భంలో ద్వితీయ పంచవర్ష ప్రణాళికను గురించి శ్రీమతి బి. ఏ. నాయక్, శ్రీయుతులు పి. లక్ష్మన్న, బి. వెంకటస్వామిగారలు మాట్లాడారు. ప్రణాళికా కార్యక్రమాలలో వుత్సాహంతో పాల్గొనాలని వారు ప్రజలను వుద్బోధించారు. తరువాత వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. ఈ వుత్సవానికి 4000 మందికి పైగా ప్రజలు వచ్చారు.

కంబదూరు కేంద్రం: గ్రామంలో పాఠశాలా భవనం నిర్మాణానికై నూతిమడుగు గ్రామస్థురాలు శ్రీమతి లక్ష్మమ్మ రూ. 2000 విరాళమిచ్చారు.

కొడిగినహళ్లి: ఈకేంద్రంలో శ్రమదానం, పారిశుద్ధోద్యమాలు నడుపబడినవి. ఇంచుమించు 2 ఫర్లాంగుల పొడువుగల అప్రోచ్ రోడ్డు మరమ్మతుకై మిట్లమేకిపల్లికి చెందిన యించుమించు 100 మంది 5 రోజులు పనిచేశారు. కిరికెర గ్రామంలో యించుమించు 280 గజాల అప్రోచ్ రోడ్డు మరమ్మతులో యించుమించు 85 మంది పాల్గొన్నారు. చెరువు, నల్లకింద కాలువల మరమ్మతులో అప్పలకుంట గ్రామస్థులు యించుమించు 7 రోజులు పని చేశారు.



21-12-58 న శ్రీమతి నీలం సంజీవరెడ్డి నిజామాబాదు జిల్లా బోధన్‌లో ప్రసూతివార్డును ప్రారంభించారు.

పుట్లూరు కేంద్రం: హరిజనవాడలో గ్రామ సహాయక శిబిరం పనిచేసినప్పుడు సెనగలగూడూరు గ్రామస్థులు యెట్టి ప్రభుత్వ సహాయములేకుండా ఫర్లాంగు నిడివిగల కచ్చారోడ్డు నిర్మించారు.

కద్రకల్లు గ్రామస్థులు పాఠశాలా భవనం నిర్మాణానికై రమారమి 5 యెకరాల స్థలాన్ని బాగు చేశారు.

## చిత్తూరు

1958 నవంబరు మొదటివారంలో సుగాలమిట్టలో పుంగనూరు తాలూకా రైతులు, వెనుకబడిన తరగతులు, షెడ్యూల్డుకులాల మహాసభ జరిగింది.

లోకసభ అధ్యక్షుడు శ్రీ ఎమ్ అనంతశయనం అయ్యంగారు యీ మహాసభను ప్రారంభిస్తూ వెనుకబడిన కులాలు, షెడ్యూల్డు కులాలు సాంఘికంగా, ఆర్థికంగా, విద్యావిషయికంగా అభివృద్ధి చెందవలసిన అగత్యాన్ని నొక్కిచెబుతూ వారికై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేసేసహాయాన్ని గురించి వివరించారు. అసోసియేషన్ అధ్యక్షుడు శ్రీ ఐ. దేశికాచారి ఆ ప్రాంతానికి ఆస్పత్రి సౌకర్యాలను కలుగజేయాలనీ విద్యుచ్ఛక్తిని సరఫరా చేయాలనీ అన్నారు. శ్రీయుతులు సి. దాస్, కె. సుబ్బారావు ప్రభృతులుకూడా ప్రసంగించారు. శ్రీ ఎస్. శేషాచార్లు వందనసమర్పణ చేశారు.

## కడప

“మన మహానాయకులు మనదేశానికి స్వాతంత్ర్యాన్ని సాధించిన పిమ్మట యువకులకు కలిగే ముఖ్యమయిన లాభాలలో లోకసహాయక సేన శిక్షణాశిబిరాలు ఒకటి. మనదేశాన్ని, కష్టపడి సంపాదించుకొన్న స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకొనుటకై యీ శిక్షణద్వారా మనం తగిన క్రమశిక్షణను, తుపాకుల వినియోగాన్ని, యితర మిలిటరీ కార్యకలాపాలను నేర్చుకుంటాము” అని జిల్లా కలెక్టరు శ్రీ ఏ, రామచంద్రారెడ్డి 1-12-58న మైదుకూరులో లోకసహాయక శిక్షణా శిబిరాన్ని ప్రారంభిస్తూ అన్నారు.

కమాండింగు ఆఫీసరు కెప్టెన్ నాయక్ మాట ప్రకారం కడపజిల్లా స. సే. శిక్షణా కార్యక్రమం లో విశిష్టత సంపాదించింది. ఆయన జిల్లా అధికారులను, ప్రత్యేకించి జిల్లాకలక్టరును వారి సహకారానికై మిక్కిలి ప్రశంసించారు.

శిబిరంలో అధికారులు నేర్పేదంతా విశ్వాసంతో శ్రద్ధగా నేర్చుకొని తమతమ గ్రామాలను అభివృద్ధి పరుచుకొమ్మని, తమతమ గృహాలను, గ్రామాలను అవసరమైనప్పుడు దేశాన్ని సైనికులలా రక్షించుకొమని శిక్షితులకు జిల్లా ప్లానింగు ఆఫీసరు విజ్ఞప్తి చేశారు.

కెప్టెన్ నాయక్ జిల్లాకలక్టరు, జిల్లా ప్లానింగు ఆఫీసరు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, యితర అనధికారులకు శిబిరాన్ని చూపించారు.

## పశ్చిమ గోదావరి

ఉప అభివృద్ధి కమీషనరు శ్రీ పి. వి. రత్నం, ఐ. ఏ. ఎస్., జిల్లా ప్రణాళికల అధికారితో కలిసి డిసెంబరు 15 నుంచి 18 వరకూ తాడేపల్లిగూడెం, పెంటపాడు, గణపవరం, ఆకివీడు, దెందులూరు అభివృద్ధికేంద్రాలలో పర్యటించారు. ఆయన గ్రామస్థులను కలుసుకుని మాట్లాడుతూ రోడ్డుపక్కలను, పొలాల పక్కగల పోరంబోకు భూములలోను లాభసాటియయిన కొబ్బరివంటి చెట్లను నాటమని, అధికోత్పత్తి సాధనకై ఆధునిక వ్యవసాయ పద్ధతులను అవలంబించమని వారికి సలహా యిచ్చారు.

16-12-58 న ఆయన పెదనింద్రకొలనులో ఒక వాయుయంత్రాన్ని ప్రారంభించారు. ఇది యింట్లో యింధనం ప్రయోజనాలకి, పొలంలో యెరువు ప్రయోజనాలకికూడా వుద్దేశించబడింది. 17-12-58న ఆయన తణుకులో కృత్రిమ పిండోత్పత్తి కేంద్రాన్ని తనిఖీచేశారు. గోపన్నపాలెం విస్తరణ శిక్షణా కేంద్రాన్ని, నాగులదేవుని పాడు "పశుగణాభివృద్ధి కేంద్రాన్ని" కూడా ఆయన దర్శించారు.

18-12-58 మధ్యాహ్నం ఆయన అభివృద్ధి కార్యక్రమంతో సంబంధించిన జిల్లా అధికారుల సమావేశాన్ని జరిపి పంచవర్ష ప్రణాళికా పథకాలక్రింద జరిగిన అభివృద్ధిని, భీమడోలు, దెందులూరు 2 వ అంచె కేంద్రాలలో సహకార సంఘాలద్వారా పరపతిని సమకూర్చే విషయాన్ని, గ్రామాలలో రాబీ వుద్యమాన్ని గురించి చర్చలు జరిపారు.

## గుంటూరు

గుంటూరు జిల్లా ప్రణాళికలు, అభివృద్ధి సంఘం నాగార్జునసాగర్ లో గుంటూరుజిల్లా కలెక్టరు శ్రీ ఎమ్. ఏ. హాలీం, ఐ. ఏ. ఎస్., అధ్యక్షతన సమావేశమయింది.

"రోడ్లు, గ్రామ ప్రణాళికలు" క్రింద మిగులు పనులు సరిగా జరగనందున 1958-59 లో వాటి నిమిత్తం అదనంగా రూ. 1,70,000/- కేటాయించమని ప్రభుత్వాన్ని కోరాలని తీర్మానించబడింది.

పెట్టుబడులు హెచ్చేట్టు చేయుట ముఖ్య కార్యక్రమమయినందున ఆ విషయంలో యింకా యెక్కువగా కృషిచేయమని జిల్లా కలక్టరు సభ్యులకు విజ్ఞప్తి చేశారు. శాసనసభ, శాసనమండలుల సభ్యులకు సూచనప్రాయంగా ఒక్కొక్కరికి రూ. 1,000 లక్ష్యాన్ని, పార్లమెంటు సభ్యులకు ఒక్కొక్కరికి రూ. 2,000 లక్ష్యాన్ని నిర్ణయించాలని కూడా అధ్యక్షుడు సూచించారు. సంఘం యీ సూచనను యేకగ్రీవంగా ఆమోదించింది.

1958-59 లో గ్రామీణ గృహవసతి పథకం అమలుకై యీ సంఘం నాదెండ్ల పంచాయతీ సమితి బ్లాకులో దిగువ 5 గ్రామాలను యెన్నింది.

1. నాదెండ్ల.
2. తూబాడు.
3. ఎడ్లపాడు.
4. జగ్గాపురం.
5. సోలాసా.

ఈ సంఘం 1958-59 లో తాడికొండ అభివృద్ధి కేంద్రంలో వివిధ కార్యక్రమాల అమలును ఆమోదించింది.

సభ్యులు కొనసాగుతున్న ప్రణాళికా పథకాల వివిధాంశాలను గురించి చర్చించి దిగువ సూచనలు చేశారు :

1 ట్రాక్టర్లు, బుల్‌డోజర్లు సకాలంలో సరఫరా చేయబడాలి.

2 సంక్షేమ పాఠశాలల్లో మధ్యాహ్నభోజనంపెట్టే వసతిని ఒక్క వెనుకబడిన తరగతుల విద్యార్థులకే పరిమితంచేయక దానిని అన్నికులాల పిల్లలకు విస్తరింపచేయాలి.

## హైదరాబాదు

రెవిన్యూశాఖా మంత్రి శ్రీ కళా వెంకటరావు 5-12-58 న మేడిచల్‌లో కొత్తగా కట్టిన ఆస్పత్రి భవనాన్ని ప్రారంభించారు. ఆ భవనం నిర్మాణానికి రూ. 13,000 ఖర్చు అయింది. అందులో రూ. 10,000 ప్రభుత్వం యిచ్చింది. రూ. 3,000 ప్రజలు యిచ్చారు. స్థానిక పురపాలక సంఘం మంత్రిగారికి స్వాగత పత్రం సమర్పించింది. అందులో, వసతిగృహంతో సహా వున్నతపాఠశాల, ప్రసూతి ఆస్పత్రి, అభివృద్ధి కార్యక్రమంలోగల యితర సౌకర్యాలతోసహా తమ తక్షణావసరాలు వివరించబడినవి.

తాలూకా అవసరాలనుగురించి తనకు తెలుసుననీ, ప్రభుత్వకృషితో ప్రజలుకూడా సహకరించినట్లయితే వారి అవసరాలు ద్వితీయ పంచవర్షప్రణాళిక సమాప్తికి ముందుగానే క్రమంగా తీర్చబడగలవనీ మంత్రిగారు స్వాగతపత్రానికి సమాధానంచెబుతూ పేర్కొన్నారు. ప్రతి తాలూకా ముఖ్యపట్నంలోను ఒక స్థానిక ఆరోగ్యకేంద్రం నెలకొల్పబడగలదనీ, అయితే అందుకు ప్రజలు రూ. 10,000, కేంద్రానికి భూమిని యివ్వవలసివుంటుందని, అప్పుడు మిగిలిన ఖర్చును ప్రభుత్వం మంజూరు చేస్తుందనీకూడా ఆయన చెప్పారు.

"వెనుకబడిన" అన్నపదం మనిషిని మానసికంగా క్రుంగదీస్తుందనీ, కాబట్టి ఆ పదాన్ని ప్రజలు తమ మనస్సులో పెట్టుకోరాదని ఆయన వుద్బోధించారు. జనాభా పెరుగుదలవల్ల వుత్పన్నమయిన సమస్యల పరిష్కారానికై ప్రజలు వ్యవసాయం కాక ప్రత్యామ్నాయ పనులను చేపట్టాలన్నారు. రైతు సంవత్సరంలో 120 రోజులకిమించి పని చేయడు. మిగిలిన 240 రోజులు వృథా అయిపోతున్నాయి. ఈ రోజులలో కుండల పరిశ్రమ, కోళ్ల పెంపకం, అంబర్ చర్ఖావంటి ప్రత్యామ్నాయపు పనులలో కుటుంబ



మీర్ ఆలంవద్ద 180 లక్షల గేలన్ల ఫిల్టర్లతో 60 అం. హ్యాంపైపు కాలవ 9-12-58న రాష్ట్ర ముఖ్యమంత్రిచే ప్రారంభించబడింది.

మంతా పాల్గొన్నట్లయితే చాలా డబ్బు వస్తుంది. మనుషులు యంత్రాలతో పోటీపడలేకపోయినప్పటికీ అంతా కలిసి సమిష్టిగా సహకార ప్రాతిపదిక పై పని చేస్తే తమ సౌభాగ్యాన్ని పెంపొందించుకోవచ్చు. ప్రతిచోటా భూమి మారకుండా యథాతథంగావుండి జనసంఖ్య హెచ్చుతున్నదంటే ప్రత్యామ్నాయ వృత్తులను చేపట్టుట అవసరమనే విషయం అందులోనే ద్యోతకమవుతున్నది. ఉదాహరణగా ఆయన రాజోలు తాలూకాను చెప్పి అక్కడ భూమిని న్యాయంగా పంపిణీ చేసినట్లయితే తలకి 42 సెంట్లు వస్తుందన్నారు.

## నీటి పారుదల పనులు - ప్రజాసంస్థలు

పంచాయతీలు లేక యేవైనా యితర ప్రజా సంస్థలు కంట్రాక్టర్ల స్థానే నీటి పారుదల పనులను నిర్వహించాలని ప్రభుత్వం వాంఛిస్తున్నదని నీటి పారుదల, విద్యుచ్ఛక్తిశాఖా మంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు డిసెంబరు 7 న జరిగిన హైదరాబాదు జిల్లా వార్షిక నీటి పారుదల మహాసభలో పేర్కొన్నారు.

ఈ మహాసభను ప్రారంభిస్తున్న మంత్రిగారు యీ విభాగంలో మధ్యదళారులను తొలగించుట తమ వాంఛితమని అన్నారు. అందువల్లనే భారత్ సేవక్ సమాజ్ అంగీకరించినట్లయితే రూ. 15 లక్షలు ఖర్చయే పనిని దానిని యిచ్చుటకు ప్రభుత్వం సంసిద్ధంగా వున్నదన్నారు.

గ్రామీణులకి స్థానిక నీటి పారుదల సమస్యల గురించి బాగా తెలుస్తుంది. కాబట్టి సాంకేతిక నిపుణులు వారితో సంప్రదించాలన్నారు.

జిల్లాలో 18 లక్షల యెకరాలను మించి భూమి వున్నప్పటికి ఒక లక్ష యెకరాలకి యే కొంచెమో పైగామాత్రమే సాగుచేయబడుతున్నదని అంతకు ముందు జిల్లా కలక్టరు వెల్లడించారు. ఈ జిల్లాను మెదక్ మండలంనుంచి విడదీసి దానిని ప్రత్యేక నీటి పారుదల మండలంగా చేయాలనికూడా ఆయన వాంఛించారు. కలక్టరు, చీఫ్ ఇంజనీరుకూడా నీటి పారుదల పథకాల పురవడిని హెచ్చించాలన్నారు.

ఆలస్యంలేకుండా అధికాహారాన్ని వుత్పత్తి చేయ వలసిన ప్రస్తుత పరిస్థితులలో భారీ పథకాలకంటె చిన్నరకం నీటి పారుదల పథకాలకి ప్రాముఖ్యం యివ్వబడాలని హోంశాఖామంత్రి శ్రీ కె. వి. రంగారెడ్డి అన్నారు.

ఇతరులతోపాటు శా. స. స. శ్రీమతి సుమిత్రా దేవి, శ్రీ భోగిరెడ్డిగారలు యీ మహాసభలో పాల్గొన్నారు.

## కరీంనగరం

కరీంనగరంలో 1-11-58 నుంచి "సహకార వారం" జరుపబడింది. నవంబరు 3 న పోరండ్ల గ్రామంలో కర్షక దినోత్సవం జరుపబడింది. ఈ కార్యక్రమాలపట్ల రైతులు గొప్ప ఆసక్తిని చూపారు. వారు ఆ సందర్భంలో యేర్పాటు చేయ బడిన ఆటలలో పాల్గొన్నారు.

కరీంనగరంలో 8-11-58 న జిల్లా స్థాయి చిన్న రకం నీటి పారుదల మహాసభ జరుపబడింది. ఆ సందర్భంలో నీటి పారుదల, విద్యుచ్ఛక్తిశాఖా మంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు అధ్యక్షత వహించారు.

నవంబరు తొలిపక్షంలో చెర్లపల్లి గ్రామానికి విద్యుచ్ఛక్తి సరఫరా ఆరంభమయినందున దానికి ఒక ప్రత్యేకత వున్నది. ఇందువల్ల ముంజంపల్లి, పోరండ్ల, మానెంపల్లి గ్రామస్థులకికూడా లాభిస్తుంది.

14-11-58 న కరీంనగరం అభివృద్ధికేంద్రంలో అమితోత్సాహంతో పిల్లల దినోత్సవం జరుపబడింది. ఖార్లానా-గడ్డలో ఆరోజున యువజన క్లబ్బు ఒకటి ప్రారంభించబడింది.

## ఖమ్మం

జిల్లా కలక్టరు శ్రీ పి. సి. జేమ్సు అధ్యక్షతన డిసెంబరు 13 న పాలేరులో ఖమ్మం జిల్లా నీటి పారుదల వుపసంఘం సమావేశమయింది. ఈ సమావేశానికి కన్వీనరు శ్రీ సి. విఠల్‌రావు, డివిజనల్ ఇంజనీరు (నీటి పారుదల), యితర అధికారులు హాజరయారు. పాలేరు ప్రాజెక్టునుంచి రాబీ సాగుకై 3000 యెకరాల ఆయకట్టుకి, వైరా ప్రాజెక్టుక్రింద 1,200

యెకరాల ఆయకట్టుకి నీటిని వదలుటకై యీ సమావేశంలో నిర్ణయించబడింది.

## సాంఘిక విద్యా దినోత్సవం

1-12-58 న ఖమ్మంమెట్టులో సాంఘిక విద్యా దినోత్సవం జరిగింది. ఆ సందర్భంలో 3,000 మంది విద్యార్థులు, ఉపాధ్యాయులు, పౌరులు కలిసి పట్నం ముఖ్యవీధులలో వూరేగారు. అప్పుడు వారు సందర్భోచితమయిన నినాదాలను వ్రాసిన అట్టలను ప్రదర్శించారు.

డి. ఇ. ఓ. శ్రీ ఎన్. అప్పారావు అధ్యక్షతన ప్రభుత్వకేంద్ర గ్రంథాలయంలో బహిరంగసభ జరిగింది.

అధ్యక్షుడు సాంఘిక విద్య ప్రాముఖ్యాన్ని వివరించి అంతా ఆ దినోత్సవం ఆశయాలకు దోహదం చేయాలని విజ్ఞప్తి చేశారు.

శ్రీయుతులు సీతారామయ్య, సత్యనారాయణ రావు, పుల్లమరాజు, వివేకసాగర్ లుకూడా ప్రసంగించారు,

## శ్రీ ఎమ్. టి. రాజు ఆగమనం

రెవిన్యూబోర్డు సభ్యుడు శ్రీ ఎమ్. టి. రాజు 30-11-58 న ఖమ్మాన్ని దర్శించారు.

జిల్లా కలక్టరు, ప్రణాళికల అధికారి, యితర ముఖ్య అధికారులతో ఆయన నీటిపారుదల మున్నగు విషయాలను గురించి చర్చించారు

## కర్నూలు

సంజమల ప్రథమఅంచె కేంద్రం తొమ్మిదవ గ్రామ సహాయకుల శిక్షణాశిబిరం నెస్సాం గ్రామంలో డిసెంబరు 22 నుంచి 24 వరకూ జరిగింది. నెస్సాం. అక్కంపల్లి, పుంచకాయలపల్లి, ఒంటెద్దుపల్లి, బోడెమ్మనూరు, కాకరవాడ, గోవిందపల్లి గ్రామాల రైతులు 50 మందికి వ్యవసాయం, పశుపోషణ చిన్నరకం నీటి పారుదలలో శిక్షణ యివ్వబడింది. ఈ శిబిరానికి ప్రజలు రూ. 659 విరాళమిచ్చారు.

ఈ శిబిరాన్ని నెల్లూరు సంయుక్త జిల్లా విద్యాధికారి శ్రీ యు. ఎస్. బరజీన్ ప్రారంభించారు. శ్రీ ఎస్. ఓబులరెడ్డి జాతీయ పతాకను యెగురవేశారు.

సమాజాభివృద్ధి కార్యక్రమం విజయవంతం కావడానికి స్వయం సహాయం మిక్కిలి ముఖ్యమయినదని శిక్షితుల నుద్దేశించి ప్రసంగిస్తూ శ్రీ జి. రామకృష్ణయ్య అన్నారు. శ్రీ ఎల్. శంకరరెడ్డి ఆధునిక వ్యవసాయ పద్ధతులపై మాట్లాడారు. శ్రీ ఆర్. రామమోహనరావు చిన్నరకం నీటి పారుదలపై ప్రసంగించారు. శ్రీమతి ఎన్. సరోజినీప్రసాద్ స్త్రీ సంక్షేమ కార్యకలాపాలపై ప్రసంగించారు. వ్యవసాయ కార్యకలాపాలు, పెంటయెరువు తయారీపై ప్రత్యక్ష ప్రదర్శనలు, జపానుపద్ధతి వరి సాగు, కాంటూరు బండింగు మున్నగువాటిపై చర్చలు జరిగాయి.

కార్యక్రమం రెండవరోజున శ్రీ ఎరుకలరెడ్డి, జమ్మలమడుగు బ్లాకు కమిటీ అధ్యక్షుడు శ్రీ ఎమ్. దిబ్బారెడ్డి, జమ్మలమడుగు కేంద్రం అభివృద్ధి అధికారి, శ్రీ హెచ్. వెంకటరెడ్డిగార్లు శిక్షితుల నుద్దేశించి పంచవర్ష ప్రణాళిక, పశుపోషణ, ప్రజలు పాల్గొనుటలపై మాట్లాడారు. అయిదుగురు ఆధునిక రైతులు వ్యవసాయం, పశుపోషణలలో తమ తమ అనుభవాలను గురించి ప్రసంగించారు. పశుపోషణపై ప్రత్యక్ష ప్రదర్శనలు జరుపబడినవి.

ఆఖరిరోజున శ్రీయుతులు డి. ఎన్. పుల్లయ్యాశర్మ, సుందరం, బి. సంజీవరాయుడు, జి. నారాయణ ప్రభృతులు పాల్గొన్నారు.

శ్రమదానం యేర్పాటు చేయబడింది. పిల్లల పార్కు స్థలం సమతలం చేయబడింది.

గోవిందపల్లి, నెస్సాం గ్రామాల యువజన క్లబ్బులు నాటకాలు ప్రదర్శించాయి. బడిపిల్లలు బుర్రకథ చెప్పారు. ప్రతిరోజూ వాటిని రమారమి 3,000 మంది జనం చూశారు.

ఆకుమళ్లలో వయోజన విద్యా కేంద్రాలు తెరువబడ్డాయి. కానగుడి గ్రామంలో ఒక గ్రంథాలయం ప్రారంభింపబడింది.

1958 నవంబరులో 1 ఫర్లాంగు పక్కారోడ్డు, 8 మైళ్ల కచ్చారోడ్డు నిర్మించబడ్డాయి. 8 మై. పక్కారోడ్డు, 4 మై. కచ్చారోడ్డు బాగుచేయబడ్డాయి.

ఈ నెలలో 105 మణుగుల సెనగవిత్తనాలు పంపిణీ చేయబడ్డాయి. బావులలో పెంపకానికై 2915 బిరుచేపలు సరఫరా చేయబడ్డాయి.

స్థానిక పరిపాలన శాఖామంత్రి శ్రీ డి. సంజీవయ్య అభివృద్ధి కేంద్రంలో వరదబాధిత గ్రామాలను అనగా తిమ్మనాయుంపేట, హనుమంతగుండం, బి. తాడిపత్రి, బి. వుప్పలూరు, యెవుగుడి, పెరుసేముల, గిద్దలూరు, బ్లాకు హెడ్ క్వార్టర్సులను దర్శించారు.

## మహబూబునగరం

మహబూబునగరం జిల్లాకి 14 మై. దూరంలోగల కవరంపేటలో బాలికల ప్రాథమిక పాఠశాలా భవనానికి 5-12-58న ప్రణాళికలు, అభివృద్ధిశాఖా మంత్రి శ్రీ వి. బి. రాజు శంకుస్థాపన చేశారు. ఆ సందర్భంలో ఆయనకు అక్కడ ఘనమయిన స్వాగతం యివ్వబడింది.

మంత్రిగారికి శ్రీ జనార్దనరెడ్డి స్వాగతం చెప్పారు. గతంలో గ్రామాలలో అత్యవసరాలయిన మంచినీటి బావులు, పాఠశాలలు, ఆస్పత్రులు కూడా వుండేవి కావనీ, గ్రామాలన్నిటిని అభివృద్ధిపరచుటకు 10-15 సంవత్సరాలు పట్టవచ్చుననీ, అభివృద్ధి కార్యక్రమాలన్నిటికి ప్రజలు డబ్బు లేక శ్రమదానం రూపంలో తోడ్పడితే జాతీయ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికి దోహదం కలుగుతుందనీ శంకుస్థాపనచేసే సందర్భంలో మంత్రిగారు అన్నారు. గండిపడిన చెరువులు మరమ్మతు చేయబడాలన్నారు. గ్రామాలకి విద్యుచ్ఛక్తి లభిస్తే నీటిపారుదలకి నీరు తోడుకొనుటకు ముఖ్యంగా రైతులు అధికాహారోత్పత్తికై కృషిచేస్తున్న యీ తరుణంలో మిక్కిలి తోడ్పడగలదని అన్నారు. వ్యవసాయ ఋతువులో కష్టించి పని చేయమనీ, యితర ఋతువులలో మరో వ్యాపారమో యేదో నేర్చుకోమని ఆయన రైతులకు విజ్ఞప్తి చేశారు. ఆహార పానీయాల తరువాత ముఖ్యమయినవి బట్టలు అనీ, కాబట్టి రైతులు తీరికకాలంలో అంబర్ చర్ఖామీద నూలుతీస్తే చాల మంచిదనీ అన్నారు.

అంతకుముందు మంత్రిగారు రాగానే అమితోత్సాహులైన ప్రజాసమూహంతో పెద్ద వూరేగింపు జరిగింది. కవరంపేట ఇనస్పెక్షన్ బంగ్లాకి యెదుట గల స్థలం పతాకలతో, ఆర్చిలతో అందంగా అలంకరించబడింది.

అక్కడ హాజరయిన ప్రముఖులలో శ్రీ పాగ పుల్లారెడ్డి, శా. స. స. శ్రీమతి శాంతాబాయి, శా. స. స. శ్రీ జనార్దనరెడ్డిగార్లు వున్నారు.

## మెదక్

రామాయణ్ పేట అభివృద్ధి కేంద్రంలో నర్సింగిలో గ్రామనాయకుల శిక్షణాశిబిరం 10-12-58న ఆఖరయింది. ఈ శిబిరాన్ని నర్సింగి పంచాయతీ కమిటీ అధ్యక్షుడు శ్రీ రామిరెడ్డి 8-12-58న ప్రారంభించారు. ఈ శిబిరానికి రామాయణ్ పేట కేంద్రంలోని గ్రామనాయకులు 50 మందికిపైగా హాజరయారు. వ్యవసాయం, పశు వైద్య విద్య, సాంఘికవిద్య, పబ్లిక్ వర్క్సు, పరిశ్రమలు, ప్రజారోగ్యం, సహకారంవంటి వివిధ విషయాలపై వుపన్యాసాలు యేర్పాటు చేయబడ్డాయి. గ్రామనాయకుల నుద్దేశించి మాట్లాడినవారిలో జిల్లా విద్యాధికారి, రామాయణ్ పేట బ్లాకు అభివృద్ధి అధికారి, విస్తరణాధికారి (పశువైద్యం) విస్తరణాధికారి (వ్యవసాయం), సాంఘిక విద్యా ఆర్గనైజరు, జిల్లా పబ్లిసిటీ అసిస్టెంటు వున్నారు.

మాచారంలో 2 మైళ్ల నిడివిగల రోడ్డును 29-11-58న జిల్లా కలక్టరు ప్రారంభించారు. ఈ రోడ్డు మూడవవంతు ప్రజలసొమ్ముతో, మూడింట రెండువంతులు ప్రభుత్వ గ్రాంటుతో నిర్మించబడింది. కలక్టరు స్వల్పంగా మాట్లాడుతూ తమ ప్రాంతం అభివృద్ధికై గ్రామీణులు చేసిన కృషిని ప్రశంసించారు. శా.స.స. శ్రీ నరసింహారెడ్డికూడా ప్రసంగించారు.

## నల్గొండ

నీటిపారుదల, విద్యుచ్ఛక్తిశాఖా మంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు డిసెంబరు 11న నాగార్జునసాగర్

ఆనకట్టవద్ద ప్రాజెక్టుహౌస్‌ని ప్రారంభించారు. స్వల్పంగా మాట్లాడుతూ మంత్రిగారు ప్రాజెక్టువద్ద నిర్విరామంగా పనిచేస్తున్న వేలాది ఇంజనీర్లు, కార్మికులను ప్రశంసించారు.

నాగార్జునసాగర్ కంట్రోలుబోర్డు నిర్వహణాధికారి శ్రీ ఎస్. చక్రవర్తి ప్రాజెక్టుహౌస్‌ని ప్రారంభించమని మంత్రిగారిని కోరుతూ దినదినాభివృద్ధిని చెందుతున్న ఆనకట్టను దర్శించుటకై నానాటికీ హెచ్చుగావచ్చే ప్రేక్షకుల వసతి నిమిత్తం అది నిర్మించ బడిందన్నారు.

చీఫ్ ఇంజనీరు శ్రీ జాఫర్ అలీ వందనసమర్పణ చేశారు. ఈ ప్రాజెక్టుహౌస్ నిర్మాణానికి రూ. 2.40 లక్షలు వ్యయమయింది. దానిలో ఆధునిక సౌకర్యాలుగల విడిగదులు 30 వున్నాయి.

ప్రతినెలా ఆనకట్టను 5000 మందికిపైగా దర్శిస్తున్నారు.

## పోచంపాడు ప్రాజెక్టు

గోదావరిపై పోచంపాడు ప్రాజెక్టు ప్రారంభ పరిశీలనను ప్రభుత్వం పూర్తి చేసినదనీ, ద్వితీయ ప్రణాళికా కార్యక్రమంలో చేర్చబడుటకై కేంద్ర ప్రభుత్వానికి పూర్తి అంచనాలు పంపబడగలవనీ రాష్ట్ర నీటిపారుదల శాఖామంత్రి డిసెంబరు 2న నల్గొండజిల్లా నీటిపారుదల సలహా సంఘానికి చెప్పారు.

భారత్ సేవక్ సమాజ్‌కి రూ. 15 లక్షల కంట్రాక్టులు యివ్వబడగలవని మంత్రిగారు అన్నారు. మూసీనదిపై 6 ఆనకట్టలు నిర్మించబడగలవని శ్రీ నర్సింగరావు వెల్లడించారు. హుజూర్ నగరం తాలూకాకు లాభించగల వేములుప్రాజెక్టు యీ సంవత్సరం చేపట్టబడుతుంది.

## నక్రేకల్ కేంద్రంలో

నక్రేకల్ ప్రథమ అంచె కేంద్రంలో గ్రామీణులు అభివృద్ధి కార్యక్రమానికి పూర్తి సహకారం యిస్తున్నారు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికై యిటీవల ప్రజలు రూ. 10,000 విరాళమిచ్చారు.

ఇటీవల నల్గొండజిల్లా కలక్టరు పెర్కకొండరం గ్రామాన్ని దర్శించినప్పుడు శ్రీ కె. చినరాములు రూ. 5,000 ఖరుదుచేసే గృహాన్ని సమాజాభివృద్ధి కార్యక్రమానికై యిచ్చారు. అక్కడ ప్రసూతి కేంద్రాన్ని నెలకొల్పాలని సకంల్పించబడింది. ఈ సందర్భంలో బహిరంగసభ జరిగింది. ఆసందర్భంలో మాట్లాడుతూ కలక్టరు శ్రీ చినరాములునీ, ప్రాథమిక ఆరోగ్యకేంద్రానికి రూ. 3,000 యిచ్చిన గ్రామీణులను అభినందించారు.

## నిజామాబాదు

### జిల్లా స్థాయిగోష్టి

ఈ రాష్ట్రంలో ప్రభుత్వం ప్రజాస్వామ్య వికేంద్రీకరణ సూత్రాన్ని అమలు పరచినదనీ యిలా మరే రాష్ట్రంలోనూ జరుగలేదనీ, కమ్యూనిస్టులచేకూడా యెక్కడా అది ఆఖరికి, ఆలోచించనేనా ఆలోచించబడ లేదనీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి 20-12-58న నిజామాబాదులో జిల్లాస్థాయి గోష్టిని ప్రారంభిస్తూ అన్నారు. ఈసందర్భంలో పనిప్రారంభించిన ప్రణాళికలు, అభివృద్ధిశాఖామంత్రి శ్రీ వి. బి. రాజును ఆయన ప్రశంసించారు.

ఆయన యింకా యిలా అన్నారు: స్వాతంత్ర్య సిద్ధి పిమ్మట యిప్పుడు మేము అభివృద్ధి ప్రణాళికలకై కోటానుకోట్ల రూపాయల గురించి ఆలోచిస్తున్నాం. ప్రజలు తమ భావినిర్మాతలుగా వున్నారు కాబట్టి వారు యిప్పుడు యీభారాన్ని వహించాలి. ప్రజలు తమప్రణాళికలను పరిశీలించి, లోపాలేమైనా వుంటే సరిదిద్దుకొనుటకు వీలుగా యిట్టి మహాసభలు జరుపబడుతున్నాయి. విస్తరణ కార్యక్రమాలను నర్వహిస్తున్న అధికారులతో ప్రజలు తగినంతగా సహకరించుట లేదట. ఉత్పత్తిని హెచ్చించుటకై ఆధునిక విధానాలను అర్థంచేసుకొని అవలంభించుటలో గ్రామీణులకు తోడ్పడ్డమే అధికారులపని. వారు అందుకే వున్నారు. ఉత్తమ విత్తనాలను, యెరువులను యెలా వాడాలో, పంటల తెగుళ్లను యెలా నివారించాలో మున్నగు విషయాలను వ్యవసాయాధికారి రైతులకు చెబుతారు. సహకారోద్యోగి రైతులు తమతమ సరుకును సరసమయిన



20-12-58 నిజామాబాదులో రాష్ట్ర ముఖ్యమంత్రి జిల్లా ప్రణాళికల గోష్ఠిని ప్రారంభించారు.

ధరలకు విక్రయించుకొనుటకు, సరసమయిన వడ్డీ రేటుపై అవసరమైన అప్పును పొందుటకు తోడ్పడుతాడు. ఇదంతాకూడా వుత్పత్తిని హెచ్చించుటకు ఆవిధంగా ప్రజలకు లాభం కలుగచేయుటకుమాత్రమే వుద్దేశించ బడింది. కాబట్టి ప్రజలు విస్తరణ కార్యక్రమంలో అధికారులకు సాధ్యమయినంతగా సహాకరించాలి.

ఈ విషయంలో ప్రజలు తమ బాధ్యతను తెలుసుకోవాలనే వారికి పంచాయతీ సమితులద్వారా యెక్కువ బాధ్యతలు యివ్వబడు తున్నాయి. ఇప్పుడు ప్రజలు అభివృద్ధి కార్యక్రమం భారాన్ని స్వయంగా వహించాలి. సమితులను విజయవంతం చేసే బాధ్యత ప్రజలపైవుంది. ప్రజాస్వామ్య వికేంద్రీకరణకు సంబంధించిన యీ ప్రయోగం సఫలమయినట్లయితే అప్పుడు యితర రాష్ట్రాలు మనరాష్ట్రాన్ని మెచ్చుకుని అవికూడా యీవిధానాన్ని అవలంబిస్తాయి. అది విఫలమయితే, అప్పుడు ప్రజాస్వామ్యానికి, మనం యేర్పరచుకున్న సోషలిస్టు ఆదర్శాలకు ప్రగతి వుండదు. దేశంలో ప్రజాస్వామ్యం విఫలమయినట్లయితే నిరంకుశపరిపాలన ప్రమాదాలేమిటో అందరికీ తెలుసు.

ముఖ్యమంత్రి ప్రసంగాన్ని ముగిస్తూ, నిజామాబాదు తెలంగాణాలో పురోగామిజిల్లా అనీ, కాబట్టి అది అభివృద్ధి కార్యక్రమం విషయంలో యితర జిల్లాలకు మార్గదర్శి కావాలని అన్నారు.

## రాబీవుద్యమం

నిజామాబాదుజిల్లా ఆర్మూరు అభివృద్ధికేంద్రంలో 1-10-58 నుంచి జరిగే ముఖ్యకార్యక్రమం రాబీ వుత్పత్తి వుద్యమమై వున్నది. ఉత్పత్తి హెచ్చుదలకై జరుపబడే యీవుద్యమంలో ప్రచారసభలు, ప్రత్యక్ష ప్రదర్శనలు, వుపన్యాసాలు, రైతులతో వ్యక్తిగత పరిచయం మున్నగు కార్యక్రమాలు చేరివున్నాయి.

ఈ కేంద్రంలోని 68 గ్రామాలలో 50 గ్రామాలు యీవుద్యమంపని అమలుకు యెన్నబడినవి. ఎన్నికయిన గ్రామాలలో 54 మంది సభ్యులుగల 20 బ్రిగేడీలు పనిచేస్తున్నాయి. రైతుల

అవసరాల జాబితాలకు తుదిరూప మివ్వబడుతున్నది. సకాలంలో వ్యవసాయ వస్తువుల సరఫరాకై ఒక పద్ధతి ప్రకారం ఇండెంటులు తయారు చేయబడుతున్నాయి. వరి విత్తనాలు, పచ్చియెరువుల సరఫరా అప్పుడే ప్రారంభమయింది. ఈ ప్రాంతానికి కొత్తరకమైన సి. హెచ్. 45 ఆర్. డి. ఆర్. 7 అధికంగా వాడకమవుతున్నాయి. వివిధ గ్రామాల అవసరాలను దృష్టిలోపెట్టుకొని వేర్వేరు వ్యవసాయ గిడ్డంగులలో సరుకు నిలవకై యేర్పాట్లు చేయబడినవి. రాబీ, ఆబీ పంటలకు సరైనమోతాదు యెరువును వాడే ప్రత్యేక వుద్యమంయిది. వేర్వేరు పచ్చియెరువు పంటల వాడకం, వ్యాప్తిలకై సర్వ విధాలా ప్రయత్నించ బడుతున్నది.

పైరులకు పట్టగల చీడలు, వ్యాధులను గురించి వాటి నివారణ పద్ధతులనుగురించి రైతులకు బోధించబడుతున్నది. చీడలు, వ్యాధులు సంభవించక ముందే క్రిమిసంహారకమయిన మందులు మున్నగు వాటిని రైతులవద్దనే నిలవవుంచే యేర్పాటు చేయుటకు కృషి చేయబడుతున్నది.

ఈకాలంలో పెర్కిట్, జక్రనపల్లిలలో 2 గ్రామ నాయకుల శిక్షణా శిబిరాలు యేర్పాటు చేయబడినవి. ఆధునిక వ్యవసాయ పద్ధతుల అవలంబన, సరైన మోతాదులో యెరువుల వాడకం, తగిన పద్ధతులలో చీడలు, వ్యాధుల నివారణ, వుత్తమ విత్తనాలు, ఆధునిక వ్యవసాయ పరికరాల వాడకం మున్నగు చర్యలద్వారా అధికోత్పత్తిని సాధించే పద్ధతులను రైతులకు బోధపరచుట వాటి ప్రధానాశయం. ప్రత్యక్ష ప్రదర్శనలుకూడా యేర్పాటు చేయబడినవి. వ్యవసాయం వివిధ అంశాలపై వుపన్యాసాలు యివ్వబడినవి.

ఒక్కొక్క శిబిరంలోను యించుమించు 50 మంది రైతులకి శిక్షణ యివ్వబడింది. ఒక్కొక్క శిబిరంలోను 3–4 నిపుణులు వ్యవసాయ విషయాల పై వుపన్యసించారు.

## నెల్లూరు

వ్యవసాయ డిప్యూటీ డైరక్టరు (గుంటూరు), వి. రామారావు అధ్యక్షతన డిసెంబరు 9న బుచ్చిరెడ్డిపాలెం వరి పరిశోధన కేంద్రంలో రైతు దినోత్సవం జరుపబడింది.

రాష్ట్రంలో వరి పరిశోధన కేంద్రాలలో జరిగే కృషి ముఖ్యంగా స్థానిక కేంద్రం సాధించిన కృషిని తెలిపే ప్రదర్శన యేర్పాటు చేయబడింది.

వరిసాగులో జరిపిన పరిశోధన ఫలితాలనుగురించి వరి నిపుణుడు శ్రీ ఎమ్. ఎస్. పవారీ మాట్లాడారు. జిల్లా వ్యవసాయాధికారి. అదనపుజిల్లా వ్యవసాయాధికారి, మొక్కల రక్షణ సహాయకుడుకూడా ప్రసంగించారు. కోవూరు తాలూకాలో జరిగిన పంటల పోటీలో నెగ్గినవారికి, ప్రదర్శనకి చక్కని వస్తువులను పంపినవారికి బహుమతులు పంచిపెట్టుటతో వుత్సవం ముగిసింది.

## ముఖ్యమంత్రి ఆగమనం

నెల్లూరుకి 10 మైళ్ల దూరంలోగల సిద్దిపురం సహకార భూమి, సెటిల్మెంటు కాలనీ నివాసులు యించుమించు 2,000 మంది యేనాదులు, యెరుకలు, తదితరులు డిసెంబరు 6 న ముఖ్యమంత్రికి ఘనమయిన స్వాగతం యిచ్చారు.

కాలనీ సంస్థాపకుడు శ్రీ వి. రాఘవయ్య ముఖ్యమంత్రికి స్వాగతం చెప్పారు. కాలనీ పథకం విజయం పట్ల, అక్కడ నేరాలు, త్రాగుడు లేనందుకు ముఖ్యమంత్రి తమ హర్షాన్ని ప్రకటించారు. కాలనీ అభివృద్ధికి కాలనీ వాసులు రూ. 7,000 పైగా రొఖ్ఖం యివ్వటం ముదావహమన్నారు. ఇంచుమించు రూ. 1 లక్ష వ్యయం కాగల గృహవసతి పథకం విషయంలో సుముఖంగా పరిశీలించగలనని ఆయన అన్నారు.

## పిల్లల దినోత్సవం

బహుమతులు, విరాళాలతో, డ్రిల్లు, వినోద కార్యక్రమాలతో నెల్లూరుజిల్లా అంతటా పిల్లల దినోత్సవం జరుపబడింది.

జిల్లా ముఖ్యపట్నమయిన నెల్లూరులో, స్థానిక రిజర్వు పోలీసుదళం సభ్యుల పిల్లలుచేసిన డ్రిల్లును చాలమంది చూశారు. ఈ వుత్సవాలకు అధ్యక్షత

వహించిన జిల్లా కలక్టరు పిల్లలు భారమనే ఆలోచనను విడిచిపెట్టి రేపటి పౌరులకై యెక్కువ ఆరోగ్యకరం, ఆనందదాయకం, సౌభాగ్యోపేతము అయిన భవిష్యత్తు నిమిత్తం కృషి సలుపమన్నారు. ప్రత్యేకం బాల నేరస్థుల సమస్యను గురించి ప్రస్తావించి, దాని పరిష్కారంలో తోడ్పడమని ప్రజలనుద్బోధించారు.

స్థానిక పాఠశాలలు నృత్య ప్రదర్శనలు మున్నగు వినోద కార్యక్రమాలను యేర్పాటు చేశాయి. అందులో పాల్గొన్నవారికి బహుమతులు యివ్వబడ్డాయి. ఈ కృషి సఫలం కావాలని గవర్నరు మున్నగు ప్రముఖులు పంపిన సందేశాలుకూడా చదువబడినవి.

అభివృద్ధికేంద్రం ప్రాంతాలన్నిటిలోను పిల్లల దినోత్సవం అమితోత్సాహంతో జరుపబడింది. అందులో చాలమంది ప్రజలు పాల్గొన్నారు. ఈ రోజున పాఠశాలకు భూమి, భవనాలు కానుక యివ్వబడినవి. చ్యిర్లకేంద్రంలో భోగసముద్రం నివాసిని శ్రీమతి మాదల యేనాదమ్మ ఒక కొత్త భవనాన్ని, కొంత ఖాళీ స్థలాన్ని తన గ్రామంలో వసతి లేక మూసివేయబడనున్న ఒకేఒక పాఠశాల కొనసాగే నిమిత్తం యిచ్చింది. ఈ కానుక విలువ రూ. 6,700/- వరకూ వుంటుంది.

ఆ రోజున యివ్వబడిన యితర విరాళాలు యివి :

చేజెర్ల కేంద్రం అన్నవారిపల్లిలో శ్రీ జి. రామయ్య సోదరులు ఒక పెంకుటి భవంతిని, ఖాళీ స్థలాన్ని యిచ్చారు.

కురిచెర్ల కేంద్రం అనంతవరం నివాసులు రూ. 500 ఖరీదుచేసే భవనాన్ని యిచ్చారు.

కురిచేడుకేంద్రం పల్లిలలో తమ కాలనీలోగల పాఠశాల భవనాన్ని రూ, 50/- పై సమష్టిగా మరమ్మతు చేయగలమని యేనాదులు ప్రకటించారు.

తోటపల్లి గూడూరుకేంద్రం వరకంపూడిలో పాఠశాలకై రూ. 4,000 ఖరీదుచేసే స్థలాన్ని శ్రీ వై. రాజారామిరెడ్డి యిచ్చారు.

తోటపల్లి గూడూరులో పాఠశాల భవనానికై రూ. 2,000 ఖరీదుచేసే స్థలాన్ని శ్రీ ఐ. రామచంద్రారెడ్డి యిచ్చారు.

ఇందుకూరుపేట కేంద్రంలోని పాఠశాల అభివృద్ధికై సహాయాలు రూ. 1620.





ప్రణాళికల మంత్రి పథకాన్ని ప్రారంభిస్తున్న దృశ్యం

# చిన్న మొత్తాల పొదుపుకి కొత్త సౌకర్యం

క్యూములేటివ్ టైమ్‌డిపాజిట్ పథకాన్ని హైదరాబాదు జనరల్ పోస్టాఫీసులో 1959 జనవరి 2 న రాష్ట్ర ప్రణాళికలు, అభివృద్ధి శాఖామంత్రి శ్రీ వి బి రాజు ప్రారంభించారు ఈ పథకంవల్ల తక్కువ రాబడివర్గాలు ప్రణాళికా పథకాలకు తోడ్పడుతూనే భావి అవసరాలకు డబ్బు దాచుకొనుటకు మరొక చక్కని సౌకర్యం యేర్పడింది

జాతీయ ప్రణాళిక అమలు నేడు యెదురవుతున్న మిక్కిలి ముఖ్యమయిన సమస్య గృహ ఆదాయాలని బట్టి ఖర్చు చేయవలెనని మంత్రిగారు అన్నారు దీని పరిష్కారానికై ఖర్చు తగ్గింపు కార్యక్రమం ప్రారంభించవలసివచ్చింది ఖర్చు తగ్గింపులో హెచ్చు రాబడి వర్గాలు మార్గదర్శకత్వం వహించాలి

పొదుపువుద్యమం విజయం కావాలంటే అది ప్రజలను ఆకర్షించాలి ఈ విషయంలో ప్రజలను తాత్విక దృక్పథంతో సమీపించాలి ఈనాటివారి త్యాగంవల్ల ముందు ముందు మేలుకలుగుతుందని వారికి చెప్పాలి

పొదుపువుద్యమం మనదేశంలో శాశ్వత వుద్యమం కాబోతున్నది. పొదుపు డబ్బును సరైన వ్యవస్థ ద్వారా చలామణీలోనికి తీసుకురావాలి చిన్న మొత్తాల పొదుపు విషయంలో ఆంధ్రప్రదేశ్ యితర రాష్ట్రాలకంటె ఆట్టే వెనుకబడిలేదు.

భూసంస్కరణలవల్ల మన ఆహారం భవిష్యత్తు చిన్న రైతులచేతిలో వున్నట్టే, దేశ భవిష్యత్తు చిన్న మొత్తాలు పొదుపుచేసేవారిపై ఆధారపడివుందని మంత్రిగారు చెప్పారు. పొదుపు వ్యవస్థ విస్తరిల్లి గ్రామాలకు ప్రాకాలనీ, అది ప్రతి కుటుంబానికి తత్వవేత్తగా, మార్గదర్శిగా వుపకరించాలనీ అన్నారు

# తాడిచెట్టు కొబ్బరిచెట్టు వాదం

ఆంధ్రదేశంలో తాటిచెట్లు అనాదిగా వున్నాయి. కొబ్బరిచెట్లు వీటికంటె వెనుక పుట్టినట్టు కనబడినా ప్రాముఖ్యం వాటికే హెచ్చు. కొన్ని సామ్యాలుగల యీ రెండు రకాల చెట్లుకూడా ప్రజలకు అనేక విధాల వుపకరిస్తాయి. ఆ కారణంచేత యివి ప్రజాజీవనంలో లీనమయి సారస్వతంతోకూడా చోటు చేసుకున్నాయి. ఉదాహరణగా దిగువ జానపద గేయాన్ని పేర్కొనవచ్చు. (ఆధునిక దృక్పథంతో తాటిచెట్టు వుపయోగాలను వివరించే వ్యాసం యీ సంచికలో వేరొకచోట పొందుపరచబడింది).

నాగలోకామంత నారదమునికీ
స్వర్గలోకామంత శోధించిచూసీ
తిరిమూడులోకాలు తిరిగి వేంచేసే
వనములో వున్నాది తాడివృక్షమ్ము
నమస్కారంచేసె నారదామునికీ
వర్ధిల్లువర్ధిల్లు ఓతాడిచెట్టా
నిన్నొక్కమాటంది కొబ్బరిచెట్టు
నన్నెవరె నాసవతి నన్నన్న దెవరూ
నిన్నకాక మొన్న పుట్టిందితానూ
పదవయ్యనారాద పంతంబుబట్టీ
సభవారిలోకెళ్ళి సాష్టాంగంబడెను
సభవారుచెప్పిరి చాటువలుపెట్టిరి
ఇంటికొచ్చినదాన్ని విడువనన్నాది
కత్తీకి జుట్టూకి కడుదునన్నాది
కొంచెపుదానావె కొబ్బారిచెట్టా
కొంచెమని మించితే దంచాయపెట్టవూ
దంచితే మరి కుంచెడుధాన్యంబు అవుగూ
చుట్టూ నీరుపోసి గట్టడ్డమేసీ
లక్ష్మమ్మతొక్కింది నవ్వుచున్నాదీ
అయిదువా పెళ్ళిళ్ళకీ ఆభమడినాదీ
పండుకొబ్బరినాది పట్నమ్ములోకీ

తిరుమాణీ తిరుచూర్ణ కాయనేనవుదూ
తిరుమాణీ తిరుచూర్ణ కాయనీవవుతే
తిరుమాణి తిరుబొట్టూపెట్టే నేనవుదూ
తిరుమాణీ తిరుబొట్టూపెట్టేనీవవుతే
శివుడుగుళ్ళల్లోకి శివపూజనేనవుదూ
శివుడుగుళ్ళల్లోకి శివపూజ నీవవుతే
ఇల్లునేసుకునీకమ్మ నేనవుదూ
ఇల్లునేసుకు నీకమ్మ నీవువుతే
నీళ్లుతోడుకునె తాడు నేనవుదూ
నీళ్ళుతోడుకునె తాడు నీవవుతే
నీళ్ళు తోడుకునీ చేదనేనవుదూ
ఎరుకలబుట్టకు గిలుక నేనవుదూ
తద్దిపేరంటాళ్ళ బుట్ట నేనవుదూ
సవత్త పేరంటాళ్ళ చాప నేనవుదూ
చదువుల్ల బళ్లోకి చదర నేనవుదూ
సభవారు గూర్చుండు చాపనేనవుదూ
కూతుళ్లుగలవారి కుదురు నేనవుదూ
అల్లుళ్లుగలవారి బెల్లమ్మునవుదూ
ఉత్తరముపత్తరము దక్షిణమునాదీ
కాకుల్ని పెంచేటి కారణమునాదీ
గెద్దల్ని పెంచేటి పెత్తనమునాదీ

ఈ ప్రయోజనానికై యీ క్యుములేటివ్ టైమ్ డిపాజిట్ పథకమే ఆఖరి పథకం కాకపోవచ్చు నన్నారు. అందరూ యీ పథకం విజయానికై తోడ్పడాలని ఆయన విజ్ఞప్తి చేశారు

పోస్టాఫీసులో యీ పథకంక్రింద ఓం ప్రథమంగా మంత్రిగారు సొమ్ము డిపాజిట్ చేశారు

పథకం

ఈ పథకంక్రింద నిర్ణీతమయిన చిన్న మొత్తాలను ప్రతినెలా డిపాజిట్టు చేయాలి ఆ సొమ్ము వివాహం, విద్య మున్నగు భావి అవసరాల దృష్ట్యా ఆయా డిపాజిటర్లు నిర్ణయించుకొన్న మేరకి వడ్డీతో సహా 5 సంవత్సరాల ఆఖరిని కాని లేక 10 సంవత్సరాల ఆఖరిని కాని తిరిగి చెల్లించబడుతుంది. ఒక పద్ధతి ప్రకారం జరిగే యీ రకం పొదుపుపద్ధతి ముఖ్యంగా పరిమితమయిన ఆదాయం కలవారికి నచ్చాలి. వారు జీవితంలో సాంఘిక, ఆర్థిక అవసరాలు రెండిటినీ యెదుర్కోవాలి పోస్టాఫీసు క్యుములేటివ్ టైమ్ డిపాజిట్టు పథకం వాటికి పరిష్కారం చూపిస్తుంది.

రూ. 5/-, 10/-, 20/-, 30/-, 100/-, 200/- డిపాజిట్టు చేయవచ్చు. అయితే కాతాను మొదలు పెట్టునప్పుడు యెంత డిపాజిట్టు చేయబడిందో అంతే ఆకాతా కొనసాగినంత కాలము చేయబడాలి కాని దానిలో తేడా రాకూడదు. ఈకాతను వయోజనులలో ఒక్కరుకాని. యిద్దరు కలసికాని, మైనరు లేక పిచ్చివాని తరఫున రక్షకుడుకాని ప్రారంభించవచ్చు ఇద్దరు వయోజనులు కలిసి ప్రారంభించిన కాతా విషయంలో సొమ్ము యిద్దరికీ కాని లేక వారిలో యేఒక్కరికయినా కాని చెల్లించబడుతుంది.

రూ. 5/- డిపాజిట్టుచేస్తే 5 సంవత్సరాల కాతాలో రూ. 325, 10 సంవత్సరాల కాతాలో రూ. 725 వస్తాయి. రూ. 10 డిపాజిట్టుచేస్తే 5 సంవత్సరాల కాతాలో 650, 10 సంవత్సరాల కాతాలో 1,415 వస్తాయి. ఇలాగే రూ. 20 అంతకుపైనా చేస్తేకూడా వాటికనురూపమయిన మొత్తాలు వస్తాయి వడ్డీరేటు 5 సంవత్సరాల కాతా విషయంలో 3.25%, 10 సంవత్సరాల కాతావిషయంలో 3.89%, వుంటుంది ఒకవ్యక్తి ప్రతినెలా రూ. 10 చొప్పున పంపి 60 నెలల తరువాత మానివేశా డనుకుంటే అతనికి తిరిగి రూ 650/- వస్తాయి. డబ్బు పంపుటను 84 నెలల తరువాత మానివేస్తే రూ 1,015 వస్తాయి

డిపాజిట్లను కేలండరు నెలలో యెప్పుడయినా చేయవచ్చు

ఒకవ్యక్తిపేర లేక సమిష్టిగా ఒకటికంటే యెక్కువ కాతాలు వుండవచ్చు

మధ్యలో డబ్బుకట్టుట మానివేస్తే కాతా పరిణితి కాలం యెన్ని నెలలు డబ్బుకట్టలేదో అన్ని నెలలు వాయిదా వేయబడుతుంది అయితే డబ్బుకట్టుట మానివేయగల నెలల గరిష్ఠం 5 సంవత్సరాల కాతా విషయంలో 5 నెలలు, 10 సంవత్సరాల కాతా విషయంలో 10 నెలలుగా నిర్ణయించబడింది.

ఒక కాతా నిర్ణీతగడువుకి ముందుగా నిలిపివేయబడిన సందర్భంలో రావలసిన సొమ్ము వడ్డీతోసహా కంట్రాక్టుకాలం ఆఖరున యివ్వబడుతుంది.

ఒక్కొక్క కాతా సందర్భంలోను డిపాజిటరుకి ఒక పాస్‌బుక్ యివ్వబడుతుంది. ప్రతిసారి డబ్బు కట్టేటప్పుడు లేక తీసుకొనేటప్పుడు అలాగే కాతా పరిణతి చెందినప్పుడు లేక మూసివేయబడేటప్పుడూ కూడా దానిని చూపించాలి.

పైన పేర్కొన్న లాభాల దృష్ట్యాక్యుములేటివ్ టైమ్ డిపాజిట్ పథకం వ్యక్తిలో ప్రతినెలా క్రమం తప్పకుండా పొదుపును ప్రోత్సహించుటే కాక జాతీయ సౌభాగ్యం పెంపుదలకు దోహదంకూడా చేస్తుంది.

---

# తాడిచెట్టు కొబ్బరిచెట్టు వాదం

ఆంధ్రదేశంలో తాటిచెట్లు అనాదిగా వున్నాయి. కొబ్బరిచెట్లు వీటికంటె వెనుక పుట్టినట్టు కనబడినా ప్రాముఖ్యం వాటికే హెచ్చు. కొన్ని సామ్యాలుగల యీ రెండు రకాల చెట్లుకూడా ప్రజలకు అనేక విధాల వుపకరిస్తాయి. ఆ కారణంచేత యివి ప్రజాజీవనంలో లీనమయి సారస్వతంతోకూడా చోటు చేసుకున్నాయి. ఉదాహరణగా దిగువ జానపద గేయాన్ని పేర్కొనవచ్చు. (ఆధునిక దృక్పథంతో తాటిచెట్టు వుపయోగాలను వివరించే వ్యాసం యీ సంచికలో వేరొకచోట పొందుపరచబడింది).

నాగలోకమంత నారదమునికీ
స్వర్గలోకామంత శోధించిచూసీ
తిరిమూడులోకాలు తిరిగి వేంచేసే
వనములోవున్నాది తాడివృక్షమ్ము
నమస్కారంచేసె నారదామునికీ
వర్థిల్లువర్థిల్లు ఓతాడిచెట్టా
నిన్నొకమ్మాటంది కొబ్బరిచెట్టు
నన్నేవరె నాసవతి నన్నన్నదెవరూ
నిన్నకాక మొన్న పుట్టిందితానూ
పదవయ్యానారాద పంతంబుబట్టీ
సభవారిలోకెళ్ళి సాష్టాంగంబడెను
సభవారుచెప్పీరి చాటువలుపెట్టీరి
ఇంటికొచ్చినదాన్ని విడువనన్నాది
కత్తికి జుట్టూకి కడుదునన్నాది
కొంచెపుదానావె కొబ్బారిచెట్టా
కొంచెమని మించితే దంచాయపెట్టవూ
దంచితే మరి కుంచెడుధాన్యంబు అవుదూ
చుట్టూ నీరుపోసి గట్టడమేసీ
లక్ష్మమ్మతొక్కింది నవ్వుచున్నాదీ
అయిదువా పెళ్ళిళ్ళకీ అక్షమడినాదీ
పండుకొబ్బరినాది పట్నమ్ములోకీ
తిరుమాణి తిరుచూర్ణ కాయనేనవుదూ
తిరుమాణి తిరుచూర్ణ కాయనీవవుతే
తిరుమాణి తిరుబొట్టూపెట్టే నేనవుదూ
తిరుమాణి తిరుబొట్టూపెట్టేనీవవుతే
శివుడుగుళ్ళల్లోకి శివపూజనేనవుదూ
శివుడుగుళ్ళల్లోకి శివపూజ నీవవుతే
ఇల్లునేసుకునీకమ్మ నేనవుదూ
ఇల్లునేసుకు నీకమ్మ నీవవుతే
నీళ్లుతోడుకునె తాడు నేనవుదూ
నీళ్ళుతోడుకునె తాడు నీవవుతే
నీళ్ళు తోడుకునీ చేదనేనవుదూ
ఎరుకలబుట్టకు గిలుక నేనవుదూ
తద్దిపేరంటాళ్ళ బుట్ట నేనవుదూ
సవత్త పేరంటాళ్ళ చాప నేనవుదూ
చదువుల్ల బళ్లోకి చదర నేనవుదూ
సభవారు గూర్చుండు చాపనేనవుదూ
కూతుళ్లుగలవారి కుదురు నేనవుదూ
అల్లుళ్లుగలవారి బెల్లమ్మునవుదూ
ఉత్తరముపత్తరము దక్షిణమునాదీ
కాకుల్ని పెంచేటి కారణమునాదీ
గెద్దల్ని పెంచేటి పెత్తనమునాదీ

ఈ ప్రయోజనానికై యీ క్యూమువేటివ్ టైమ్ డిపాజిట్ పథకమే ఆఖరి పథకం కాకపోవచ్చు నన్నారు. అందరూ యీ పథకం విజయానికై తోడ్పడాలని ఆయన విజ్ఞప్తి చేశారు.

పోస్టాఫీసులో యీ పథకంక్రింద ఓం ప్రథమంగా మంత్రిగారు సొమ్ము డిపాజిట్ చేశారు.

పథకం

ఈ పథకంక్రింద నిర్ణీతమయిన చిన్న మొత్తాలను ప్రతినెలా డిపాజిట్టు చేయాలి. ఆ సొమ్ము వివాహం, విద్య మున్నగు భావి అవసరాల దృష్ట్యా ఆయా డిపాజిటర్లు నిర్ణయించుకొన్న మేరకి వడ్డీతో సహా 5 సంవత్సరాల ఆఖరిని కాని లేక 10 సంవత్సరాల ఆఖరిని కాని తిరిగి చెల్లించబడుతుంది. ఒక పద్ధతి ప్రకారం జరిగే యీ రకం పొదుపుపద్ధతి ముఖ్యంగా పరిమితమయిన ఆదాయం కలవారికి నచ్చాలి. వారు జీవితంలో సాంఘిక, ఆర్థిక అవసరాలు రెండిటినీ యెదుర్కోవాలి. పోస్టాఫీసు క్యూములేటివ్ టైమ్ డిపాజిట్టు పథకం వాటికి పరిష్కారం చూపిస్తుంది.

రూ. 5/-, 10/-, 20/-, 30/-, 100/-, 200/- డిపాజిట్టు చేయవచ్చు. అయితే కాతాను మొదలు పెట్టునప్పుడు యెంత డిపాజిట్టు చేయబడిందో అంతే ఆకాతా కొనసాగినంత కాలము చేయబడాలి కాని దానిలో తేడా రాకూడదు. ఈకాతను వయోజనులలో ఒక్కరుకాని. యిద్దరు కలసికాని, మైనరు లేక పిచ్చివాని తరపున రక్షకుడుకాని ప్రారంభించవచ్చు. ఇద్దరు వయోజనులు కలిసి ప్రారంభించిన కాతా విషయంలో సొమ్ము యిద్దరికీ కాని లేక వారిలో యేఒక్కరికయినా కాని చెల్లించబడుతుంది.

రూ. 5/- డిపాజిట్టుచేస్తే 5 సంవత్సరాల కాతాలో రూ. 325, 10 సంవత్సరాల కాతాలో రూ. 725 వస్తాయి. రూ. 10 డిపాజిట్టుచేస్తే 5 సంవత్సరాల కాతాలో 650, 10 సంవత్సరాల కాతాలో 1,415 వస్తాయి. ఇలాగే రూ. 20 అంతకుపైనా చేస్తేకూడా వాటికనురూపమయిన మొత్తాలు వస్తాయి. వడ్డీరేటు 5 సంవత్సరాల కాతా విషయంలో 3.25%, 10 సంవత్సరాల కాతావిషయంలో 3.89%, వుంటుంది. ఒకవ్యక్తి ప్రతినెలా రూ. 10 చొప్పున పంపి 60 నెలల తరువాత మానివేశాడనుకుంటే అతనికి తిరిగి రూ. 650/- వస్తాయి. డబ్బు పంపుటను 84 నెలల తరువాత మానివేస్తే రూ. 1,015 వస్తాయి.

డిపాజిట్లను కేలండరు నెలలో యెప్పుడయినా చేయవచ్చు.

ఒకవ్యక్తిపేర లేక సమిష్టిగా ఒకటికంటే యెక్కువ కాతాలు వుండవచ్చు.

మధ్యలో డబ్బుకట్టుట మానివేస్తే కాతా పరిణితి కాలం యెన్నినెలలు డబ్బుకట్టలేదో అన్నినెలలు వాయిదా వేయబడుతుంది. అయితే డబ్బుకట్టుట మానివేయగల నెలల గరిష్ఠం 5 సంవత్సరాల కాతా విషయంలో 5 నెలలు, 10 సంవత్సరాల కాతా విషయంలో 10 నెలలుగా నిర్ణయించబడింది.

ఒక కాతా నిర్ణీతగడువుకి ముందుగా నిలిపివేయబడిన సందర్భంలో రావలసిన సొమ్ము వడ్డీతోసహా కంట్రాక్టుకాలం ఆఖరున యివ్వబడుతుంది.

ఒక్కొక్క కాతా సందర్భంలోను డిపాజిటరుకి ఒక పాస్‌బుక్ యివ్వబడుతుంది. ప్రతిసారి డబ్బు కట్టేటప్పుడు లేక తీసుకొనేటప్పుడు అలాగే కాతా పరిణతి చెందినప్పుడు లేక మూసివేయబడేటప్పుడూ కూడా దానిని చూపించాలి.

పైన పేర్కొన్న లాభాల దృష్ట్యాక్యూములేటివ్ టైమ్ డిపాజిట్ పథకం వ్యక్తిలో ప్రతినెలా క్రమం తప్పకుండా పొదుపును ప్రోత్సహించుటే కాక జాతీయ సౌభాగ్యం పెంపుదలకు దోహదంకూడా చేస్తుంది.

---

# అభ్యుదయ గేయము

శ్రీ మొక్కపాటి నరసింహమూర్తి
(ఎమ్. ఏ., బి. ఇడి., ఏలూరు)

భారతీయ వీరుడా । భరతమాత పుత్రుడా
భావి భారత భూమినంత బాగుచేయ లెమ్మురా బాగుచేయ రమ్మురా

కులము, మతము, భేదములను । కూలద్రోయ బూనరా
భారతీయు లొక్కటని బాగుగాను చాటరా ఎలుగెత్తి చాటరా ॥భా॥

పెద్ద, పెద్ద ప్రాజెక్టులు పట్టుదలతో కట్టరా ।
భారత భూమినంతను బాగుగ పండింపరా । బంగరు పండింపరా ॥భా॥

భారి పరిశ్రమలనెప్పుడు బాగుగ సాగింపరా
చిన్న, చిన్న పరిశ్రమల చేరిప్రోత్సహింపరా ॥భా॥

వయోజనుల కందరకు విద్యనేర్పబూనరా
విద్యయె మన ప్రజలనెల్ల విజ్ఞానుల జేయురా ॥భా॥

స్వంత ఖర్చు మాని నీవు కొంత కూడబెట్టరా
స్మాలు సేవింగ్స్‌లో చక్కగాను దాచరా । మిగిలినంత దాచరా ॥భా॥

విశ్వప్రేమ జూపరా । విశ్వశాంతి కోరరా
విశ్వప్రేమ, విశ్వశాంతి । విజయసాధనములురా ॥భా॥

అభ్యుదయము గోరరా । అందరిమేలు కోరరా
అందరి సౌభాగ్యమే । అది యెదేశ భాగ్యమోయ్
అది యె మహాభాగ్యమోయ్ ॥భా॥

# "ఆంధ్రప్రదేశ్" ప్రకటన రేట్లు



'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరుపేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 10 శతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. **సాంకేతిక వివరాలు: 10¾ × 8½" డెమ్మీ.**
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయ్యే మొత్తమూ ప్రతినెల 8వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటినెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్‌చేయబడని డిమాండు డ్రాఫ్ట్‌ద్వారాగాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు–దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంత స్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసింది, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.


డైరెక్టర్,

**సమాచార, పౌరసంబంధముల శాఖ**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

హైదరాబాదు దక్కన్ — 1.

# ఆంధ్రప్రదేశ్ తెలుగు లిపి సంస్కరణ సంఘం

## ప్రశ్నావళి

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి అధ్యక్షతన ౧౯౫౮ డిశంబరు ౨౭, ౨౮ మరియు ౨౯ తేదీలలో ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆవరణ యందు జరిగిన తెలుగు లిపి సంస్కరణసంఘ ప్రథమ సమావేశములో చర్చించబడిన యీ క్రింది ప్రశ్నావళిని ప్రజాభిప్రాయార్థము ప్రకటించనైనది. ఈ ప్రశ్నావళికి సమాధానములను పంపగోరువారు ఈ క్రింది చిరునామాకు పంపవలెను.

కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు,
కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ తెలుగు లిపి సంస్కరణసంఘం.
కేరాఫ్, ఆంధ్రసారస్వత పరిషత్తు, కార్యాలయము,
తిలక్ రోడ్, హైదరాబాదు—౧.

## ప్రశ్నలు

౧. టైపు, లినోటైపు యంత్రాలకు, ముద్రణమునకు అనుగుణముగా తెలుగు లిపిని సంస్కరించ వలసిన ఆవశ్యకత ఉన్నదా? లేదా?

౨. ఉన్న అక్షరాలలో తీసివేయ వలసినవిగాని, వాటితో అధికంగా చేర్చవలసినవిగాని, మార్చ వలసినవిగాని ఏవైనా ఉన్నవా? ఎట్లు?

౩. సంయుక్తాక్షరాల స్వరూపమెట్లుండ వలెను? వాటిలో క్రిందగాని, మీదగాని అక్షరాలు చేర్చకుండా ఒకే పంక్తిలో కుడివైపున వ్రాయుటకు వీలగునట్లు అమర్చుట సాధ్యమా? ఎట్లు?

౪. వ్రాత లిపికిని, ముద్రణానుగుణమైన సంస్కరింప బడిన లిపికిని వ్యత్యాసము ఉండవలసి ఉండునా? ఎట్లు?

౫. ఇప్పటి లిపిలోలేని ఉచ్చారణములకు క్రొత్త సంకేతములు చేర్చవలసి ఉండునా? ఎట్లు?

౬. తెలుగు కన్నడ భాషల లిపులకు గల సామీప్యసాదృశ్యములను గమనించి ఈ రెంటికిని ఏకలిపిని రూపొందించుట అవసరమా? ఎట్లు?

౭. సంస్కరణ అవసరమైనచో అది ఆచరణములో పెట్టుటకు మార్గము లేవి?

౮ సంస్కరింపబడు లిపిలో తెలుగు అంకెలు ఉండవలెనా? ఇంగ్లీషు అంకెలుండ వలెనా?

# ప్రభుత్వ ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | ఆంధ్రప్రదేశ్‌లో ఆహారోత్పత్తి ( తె* లేక ఉ* ) | 0.12 న.పై. |
| 2. | ఆంధ్రప్రదేశ్ పశు సంక్షేమం ( ఇ* లేక తె* లేక ఉ* ) | 0.12 న.పై. |
| 3. | ఆంధ్రప్రదేశ్ చేతి పనులు ( తె* లేక ఉ* ) | 0.12 న.పై. |
| 4. | ఆంధ్రప్రదేశ్‌లో గిరిజన సంక్షేమం ( తె* లేక ఉ* ) | 0.12 న.పై. |
| 5. | ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమలు ( ఉ* ) | 0.12 న.పై. |
| 6. | ఆంధ్రప్రదేశ్ మత్స్యసంపద ( ఇ* లేక తె* ఉ* ) | 0.12 న.పై. |
| 7. | ఆంధ్రప్రదేశ్ స్థూల స్వరూపం (ఆంధ్రప్రదేశ్ మెట్‌యెగ్లాన్సు) ( ఇ* ) | 0.12 న.పై. |
| 8. | నూతన గ్రామాల నిర్మాణం-ఆంధ్రప్రదేశ్‌లో సమాజాభివృద్ధి ( ఇ* ) | 0.12 న.పై |
| 9. | ఆంధ్రప్రదేశ్ – ధాన్యాగారం - ( ఇ* ) | 0.12 న.పై. |

*గమనిక:*—ఈ పుస్తకాలు ఖరీదు డబ్బు చేరగానే పంపబడతాయి.

*ఇ = ఇంగ్లీషు
*తె = తెలుగు
*ఉ = ఉర్దూ

ప్రతులకై
ప్రచురణల విభాగం, సమాచార,
పౌరసంబంధాల డైరెక్టరు కార్యాలయం,
హైదరాబాదు 1.
చిరునామాకు వ్రాయండి.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | |
|---|---|---|
| వైశాల్యం | ... | 1,06 041 చదరపు మైళ్లు |
| జనసంఖ్య | ... | 3,12,60,133 |
| పురుషులు | ... | 1,57,42 912 |
| స్త్రీలు | ... | 1,55,17,221 |

సగటు వర్షపాతం

| | | |
|---|---|---|
| ఆంధ్ర ప్రాంతం | ... | 34.6 అంగుళాలు |
| తెలంగాణా | ... | 36.7 ,, |
| అరణ్య ప్రదేశం | ... | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 183 |
| రెవిన్యూ సర్కిళ్లు | ... | 1,000 |
| పట్టణాలు | ... | 293 |
| గ్రామాలు | ... | 26,450 |
| పంటల క్రింది ప్రదేశం | ... | 2,93,81,000 ఎకరాలు |
| 1955-56 లో నీటిపారుదలను పొందిన ప్రదేశం | .... | 66.8 లక్షల యెకరాలు |
| కౌళ్ల సంఖ్య | ... | 42,42,655 |
| 1955-56 లో వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | ... | 54.21 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | ... | 15·5 లక్షల గేలన్లు |
| రైలుమార్గాలు | ... | 2,902 మైళ్లు |
| జాతీయ రహదార్లు | ... | 1,409 ,, |
| రాష్ట్ర రహదార్లు | ... | 2,074 ,, |
| జిల్లా పెద్దరోడ్లు | ... | 2,527 ,, |
| జిల్లా ఇతరరోడ్లు | ... | 3,458 ,, |
| పాఠశాలలు | ... | 28,000 |
| కళాశాలలు | ... | 64 |
| వృత్తి విద్యా కళాశాలలు | ... | 31 |
| ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రమాణం | ... | రూ 175 37 కోట్లు |

1958-59 బడ్జెట్టు :

| | | |
|---|---|---|
| ఆదాయం | ... | రూ 63.66 కోట్లు |
| వ్యయం | ... | ,, 62.87 ,, |
| పెట్టుబడి ఖర్చు | ... | ,, 21.29 ,, |



విశాఖపట్నం జిల్లాలో రాష్ట్ర గవర్నరు: ఆయన యిటీవల ఆజిల్లాలో వరదబాధిత ప్రాంతాలలో పర్యటించినప్పుడు కొత్తూరు గ్రామస్థులను కలుసుకొనుటకై ఇలా ప్రయాణంచేశారు.